# చిత్రాంగదా నాటకము

లేక

## బభ్రువాహన



“కవిభట్టారక”

మొవ్వ దాశరథిసూరి

శ్రీరామ

# చిత్రాంగదానాటకము

లేక

## బభ్రువాహన

"కవిభట్టారక"
మొవ్వ దాశరథి సూరి

# తొలిమాట

“కావ్యేషు నాటకం రమ్యం” అని రసజ్ఞుల సూక్తి. శ్రవ్యకావ్యము కన్న దృశ్యకావ్యము రసానుభూతి యందు సుగమము. సామాన్యులు మొదలుకొని మేధావుల వఱకు నుపయోగపడునది నాటకము. “విశ్వశ్రేయః కావ్య”మ్మను సామాన్య లక్షణము కావ్య వాఙ్మయమున కంతకును సాధారణము. అట్టి శ్రేయస్సు నాపాదింపని కబ్బము నిరర్థకము. కావున నీ చిత్రాంగదా నాటకమున శాండిల్యపాత్ర కల్పనముతోఁ గొన్ని లోకోపయోగి నీతివృత్తముల నిబంధించితిని. ప్రథమాంకమున విష్కంభరచనను నాటకలక్షణకర్తలు గొందరు నిషేధించిరి. భోజుఁడు మాత్రము ప్రథమాంకమునను విష్కంభ మావశ్యకమనియే విధించెను. నే నామార్గమునే యవలంబించితిని. విష్కంభము లేనిచో నాటకరంగప్రదర్శనము కొంత కడచనినఁగాని నాటకమెచట మొదలుపెట్టఁబడుచున్నదో ప్రేక్షకులకుఁ దెలియదు. ఇందులకు మొదటి యంకమునందలి విష్కంభము మిక్కిలి యుపకరించును. నాటకమునందుఁ బాత్రానుగుణముగా గ్రామ్యాదుల వాడితిని. అది యుచితము. సంస్కృత నాటకములందును బాత్రానుగుణభాషకై ప్రాకృతము నుపయోగింతురు. నాటకకళ ప్రాచీనము నతిసుకుమారము నైనది. నాటకరచనయం దెంతరసము చిమిడియున్నను నటకు లసమర్థులైనచో రసాభివ్యక్తి గానేరదు. రచనానటన కౌశలములు మేళవించినగాని ప్రదర్శనము శోభింపదు. ఇప్పటి నటక శిఖామణులకు నాటకగ్రంథమును క్షుణ్ణముగాఁ జదువుటయే దుర్భర మగుచున్నది. వారి యిచ్చవచ్చినట్లు నాటకమును వదలి యభినయించుచున్నారు. హరిశ్చంద్ర నాటకము ఇంద్రసభా ప్రదర్శనాదులను వదలి విశ్వామిత్రుని కేకలతో నక్షత్రకుని ప్రవేశముతో నసంబద్ధముగా నారంభ మగుచున్నది. మఱియొక్క విషయము మిక్కిలి విచారణీయము. నాటకమును జూచి ప్రేక్షకు లానందపడుచున్నారు. అభినయించి నటకులు ద్రవ్యము నార్జించుకొనుచున్నారు. కాని యీ మొత్తమునకు మూలమై నాటకకర్తయైన కవిని మాత్ర మెవ్వరును స్మరింపరు. అహో! నాటకకర్తకు నటకులును బ్రేక్షకులును ఋణపడుటలేదా! అట్లు స్మరించుటకు వీరికివచ్చిన బాధ యేమియులేదు. నాటకమునందలి ప్రస్తావన నభినయించినచో నట్టి ఋణమునుండి వీరందఱు విముక్తులగుదురు.

అందులకే కవి దానియందుఁ దన విషయము నుద్ఘాటించుచున్నాఁడు. యభినేత
కాని నాటకమునే సొంతముగా నభినయింప సమర్థులుగాని యభినేత
లకుఁ బ్రస్తావనను గూడఁ బ్రదర్శింప నోపిక యెక్కడిది పాపము !
నాటకమునందుఁ బాత్రకల్పన మెక్కువగా నున్నదని సందేహింపఁ
బనిలేదు. చిన్నచిన్న పాత్రల రెంటి మూఁటి నొక్కొక్కరే యభిన
యింపవచ్చును. సుమా రెనిమిదిమంది పూరుషులు నిరువురు స్త్రీలైనచో
నభినయింప వలనుపడును.

ఇట్లు,

నాటకకర్త



1965-4-11 తేదీ కృష్ణాజిల్లా మోదుమూడి గ్రామములో గ్రంథకర్త వారి సోదరులకు జరిగిన గజోత్సవ సన్మానము



కృతి ప్రకాశకులు

శ్రీ వక్కపట్ల వేంకన్నగారి ధర్మపత్ని

రావుబహాదూరు, శ్రీ కొల్లిపర వేంకటరమణయ్యా నాయఁడుగారి చెల్లెలు

శ్రీ వక్కపట్ల బాబూరావు, B.A., B.L. గారి తల్లి

**శ్రీ వక్కపట్ల నాగరత్నమ్మగారు**

# నాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషపాత్రలు

| | |
|---|---|
| శాండిల్యుఁడు | బభ్రువాహనుఁడు |
| వెంకన్న | (మంత్రి) విశారదుఁడు |
| కోటన్న | (సేనాధిపతి) ప్రసేనుఁడు |
| రామన్న | భటుఁడు |
| ధర్మరాజు | శ్రీకృష్ణుఁడు |
| భీముఁడు | సాత్యకి |
| అర్జునుఁడు | పుండరీకుఁడు |
| వ్యాసమహర్షి | మందపాలుఁడు |
| లంబోదరశాస్త్రి | ప్రతిహారి |
| యాగవ్రతుఁడు | చారువేత్రుఁడు |

## స్త్రీపాత్రలు

| | |
|---|---|
| (వేంకన్న భార్య) మల్లి | చిత్రాంగద |
| ద్రౌపది | ఉలూచి |

## కృతి ప్రకాశకులకు

## ఆశీస్సు

తే. ఠీవిసీమకు నెత్తిన దివ్వెఁగాగ,
బహుళ సంపన్మహోదార భావములను
బేరుఁగాంచిన వకపట్ల వేంకనార్య,
మణికిఁదగుపత్నివమ్మ! సద్గుణములందు.

సీ. ఆకొన్నవారల కమృతాశనంబిడి
యాదరించుట యందు నన్నపూర్ణ
వీనులఁబూఁదేనె వెల్లువల్ దొనకంగఁ
బలుక నేర్చుట యందు నలువరాణి
పతిమాట కొకయింత మితిమీఱి నడవని
వ్రతపాలనమున నింద్రద్వితీయ
దొసఁగు లేమాత్రంబు పొసఁగ నేరనియట్టి
ఘన పవిత్రతకు గంగాభవాని

దమము శమమును నిశ్చల దైవభక్తి
మాన్యజనసేవ మొదలైన మహితవిధుల
భరతరమణీ మణీశీల పాలనమునఁ
గొమ్మలెవ్వరైన నాగరత్నమ్మకెనయె.

కం. కలవారియింటఁబుట్టితి
కలవారి గృహంబు మెట్టఁగలిగితివైనన్
గలఁగదు నీమది గర్వపుఁ
గలకలమున నెట్టిశక్తి గలదానవమా!

సీ. తనమాటయే ప్రభుస్థానంబులను శాస
నంబుగా నిలిపిన నయవిదుండు
ఆంగ్లభాషా శాస్త్రమంతయు గండూష
మొనరించి యుమిసిన యుత్కళుండ
నిజకీర్తిలతలచే నిఖలదేశములందుఁ
బూలుపూయించిన బుద్ధిశాలి
వదనరాహుప్రభ నెదిరి వారల నోరు
బంధించివైచిన భవ్యరూపి

వసుధ మచిలీపురి న్యాయవాదులందుఁ
బెద్ద, రమణయ్యనాయఁడు పేర్మియన్న
నీకుఁ, గావున నాతని నేర్పులెల్లఁ
జెలఁగునోయమ్మ నీయందుఁ జిత్రమేమి ?

తే. విమలశుభశీల విఖ్యాత వేంకనార్య
నాగరత్నాంబికా గర్భనవ్యశుక్తి
శుద్ధముక్తాఫలంబు యశోఘనుండు
భవ్యగుణముల ప్రోవు మా బాబురావు.

సీ. మహనీయజాతక మర్మంబులకు వ్యాఖ్య
నిద్దమై యొప్పు నీ నెమ్మొగంబు
ఇందిరా భారతీ సుందరుల్ తమితోడఁ
జిందాడు నెలవు నీ మందిరంబు
మందారమకరంద బిందుసందోహంబు
తేటకుమాఱు నీ మాటతీరు
కకుబంతములఁ దాఁకు ఘనకీర్తి వల్లికి
నాలవాలమ్ము నీ యన్వయంబు

దోష మావంతయైనను దొరయకుండఁ
బున్నెములనెల్ల నొకచోటఁ బ్రోవువెట్టి
నలువ నిర్మించినట్టి జన్మంబు నీది
బంధుజనగేయ! వకపట్ల బాబురాయ!

తే. అట్టి కొడుకును గోడలు నమితభక్తి
మైఁబరిచరింప మనుమలు మనుమరాండ్రు
ముద్దుఁగూర్పఁగ గేహంబు దిద్దుకొనుచు
నాయురారోగ్యములతోడ నలరవమ్మ!

ఉ. భోగములుండినన్ గలుగఁబోవదుపో భువినెల్లవారికిన్
ద్యాగము, త్యాగముండినను దైవతభక్తి జనింపదిన్నియున్
లోఁగడ నీవొనర్చిన యలుప్తతపంబున నబ్బెగా మహా
భాగవు పుణ్యజీవితవు భామిను లన్యలు నీకుసాటియే.

క. మా కులదైవము రాముఁడు
నీ కోరిన శుభములెల్ల నియతినొసంగుం
గాక పరిపూర్ణ కరుణా
లోకనములఁ బరపి యుభయలోకములందున్.

---

శ్రీరామ

శ్రీ వేంకట పరబ్రహ్మణే నమః

# చిత్రాంగదానాటకము

(ప్రస్తావన.)

## నాంది

మ. సిరిదేవేరిగ, నంజనాచలముపైఁ జెల్వొంది, భక్తావళీ
దురితార్తుల్ దొలఁగించి, వైదిక జనస్తోమంబులచ్చోఁ ద్రయీ
సరణింజేయు సపర్యలందుకొను యజ్ఞబ్రహ్మ, మా వేంకటే
శ్వరుఁడిచ్చున్ మహనీయసంపదలు శశ్వత్కీర్తి సౌభాగ్యముల్.

నాంద్యంతమున

(సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూత్ర: ఆహా! యేమి యీ సభావైభవము, రసగ్రహణ పారీణమైన మహాజనముతోఁ గ్రిక్కిఱిసి చంద్రోదయసమయ ఘూర్ణమాన మహార్ణవంబు ననుకరించుచున్నది. కాని, దీని నిప్పుడు నే నెట్లు రంజింపఁజేయవలయు.? (ఆలోచించుచుండును)

నటి : (ప్రవేశించి) ఆర్యపుత్రా! ఏమి యీ పరధ్యానము.

సూత్ర: (వెనుకకుఁ దిరిగి చూచి) ప్రేయసీ! వచ్చితివా? నే పద్యరచన ముగిసినదన్నమాట. నీకొఱకే యెదురుచూచుచున్న నేను, విషయాన్వేషణమున మునిఁగి నీరాకను గుర్తింపనైతి.

నటి : సరే వచ్చితినిగదా యిఁకఁ గర్తవ్యమేమి ?

సూత్ర: ఈ సభను సంతోషింపఁ జేయుటకన్న మనకుఁ గర్తవ్యమేమున్నది ?

నటి: అందులో సందేహమేల ? మనకీ నాటకాభినయము క్రొత్త
గాదుగదా, నాటక గ్రంథము క్షుణ్ణముగా నోటికి రాక, లోన
నొక రందించుచుండగా, సభనుజూచి తత్తరపడి వాక్యము
నందుకొనలేక, గ్రుడ్లు మిటకరించి చూచుచు, రంగస్థలమున
కిపుడు పోవలసినది నీవా ? నేనా ? యని వివాదపడుచుఁ, దడ
బాటుగా నొకరికి బదులు మఱియొకరు వచ్చి కొంత యభిన
యించిన పిదప, లోనివారు నీవు కాదు రమ్మనఁగా లోనికేగుచు
నిట్లు ప్రదర్శనమును విలంబము చేసి,రసవాహినికి భంగము చేసెడి
నవ్యనటక ప్రబుద్ధులకుఁ గదా యీ భయముండవలయును;
నాటకకళయందు సడిసన్న నీకేల ?

సూత్ర: కల్యాణీ! చక్కఁగాఁ జెప్పితివి కాని విషయమదిగాదు. ఆడినవే
యాడి మనకును జూచినవే చూచి ప్రేక్షకులకును విసుగెత్తి
నది. కావునఁ గ్రొత్తనాటకమును దేనినైన నభినయింపవలయు
నని యాలోచించుచుంటిని.

నటి : అట్లైన నిది చిక్కుసమస్యయే.

సూత్ర: ఎంత యాలోచించినను నాబుద్ధికిఁ బాలుపోవుట లేదు.
నీవైనను జెప్పుము చూచెదను.

నటి : ఆర్యా ! యేమి యీ పరిహాసము, నాట్యకళాచార్యుండవైన
నీకు నేనా చెప్పుట.

సూత్ర: అవును నీవు వంగనాచి తుంగబుఱ్ఱవు. నాటకమనఁగాఁ
బాపము నీకేమియుఁ దెలియదు పూఁతపిందెవు.

నటి : (సాభిప్రాయముగాఁ జూచి) ఈ సరసాలకేమిగాని రాత్రి నాట్య
సమయమున, నీ గాఢాలింగనముచేఁ జిత్రముగా నా బాహువు
నందలి యంగదంబొకటి వంగినది చూడుము.

సూత్ర: ఆ ! స్ఫురించినది: సుభగురాలా ! యెంత చక్కఁగా స్మరింపఁ
జేసితివి. నేఁడు మనము చిత్రాంగదానాటకమును బ్రదర్శింతము.

నటి : చిత్రాంగదయా.

సూత్ర: అవును.

నటి : (సాసూయము) అదియైనచో నే నభినయింపను.

సూత్ర: ఎందువలన ?

నటి : అదియేదో స్త్రీవిషయమైన శృంగారరస ప్రధాననాటకముగాఁ దోఁచుచున్నది.

సూత్ర: శృంగారరసమైన నభినయింపవా ? "నవరసభావములు లేని నాటకకథయున్" అన్నట్లు రసములన్నియు లేక శోభ గలుగదుగదా.

నటి : (ఈర్ష్యతో) ఏమిరసాలో నీసరసాలతోఁ గౌఁగిలింతలతో, ముద్దులతో నాశరీరమంతయు నలఁగిపోవును.

సూత్ర: అదియా నీభయము. అది శృంగార ప్రధానమేగాదు.

నటి : ఇప్పుడట్లే చెప్పెదవు. సాగును దరువాత సమరసన్నాహాలు.

సూత్ర: చెప్పునది నమ్మని నీతో నేల చెప్పవలయును.

నటి : చెప్పుము నమ్మక నేమాత్ర మేమిచేయుదును ?

సూత్ర: నాతోఁగూడి యాడుదువు.

నటి : అట్లైన నేనాడను.

సూత్ర: ఎట్లైన నాడుదువు ?

నటి : మనకిదే సమయము.

సూత్ర: కౌఁగిలించుకొనుటకా ?

నటి : (సభ్రూభంగము) నాటకములోఁ గౌఁగిలింపనని సమయము చేయుము నీతోఁగూడి యాడెదను.

సూత్ర: అదియెట్లు. రసానుగుణముగా వర్తింపవలయును గదా.

నటి : మఱి యీనాటకము శృంగారగర్భితము కాదంటివిగా.

సూత్ర: కానిమాట నిజమే.

నటి : ఐనఁ బ్రతిజ్ఞచేయుట కేమి యభ్యంతరము ?

సూత్ర: సరే, యట్లే చేసెదను. అప్పుడు వలదుగాని యిప్పుడే యొక్క సారి గట్టిగా .........

నటి : (ససంభ్రమము) ఆ ! కౌఁగిలించుకొనెదవా ?

సూత్ర: మఱి నాటకమున లేదుగదా కౌఁగిలి.

నటి : (మందహాసముతో) నిశ్చయముగానా ?

సూత్ర: నిజము.

నటి : అట్లైన నాటక విషయమును జెప్పుము. పిదప నేనే స్వయముగా నీ వడుగకుండ నొక్కసారి యాలింగనము చేసికొనెద.

సూత్ర: అట్లేని వినుము. ధర్మరాజు పట్టాభిషేకానంతరము, హయమేధ మొనరించుచు, గుఱ్ఱమును విడుచును. దాని వెంట నర్జునుఁడు కాఁపాడుచు నెడనెడ దానిఁబట్టిన రాజులజయించుచు విడిపించుట, బభ్రువాహనుఁడు పట్టుకొనగా నతనితోఁ బోరుట మొదలగునవి కథావిషయములు.

నటి : ఓహో ! బభ్రువాహనచరిత్రమా? చంపితివిగదయ్యా ! యింతసేపు. బభ్రువాహన నాటకమనక చిత్రాంగదా నాటకమంటి వేమి ?

సూత్ర: మగవాని పేరుపెట్టిన నీకుఁ గోపమువచ్చునని,

నటి : ఆర్యా ! యేమి నీగడుసుఁదనము !

సూత్ర: గడుసుఁదనముగాదు "స్త్రీ తినామాపి మధురమ్" అన్నారు, అభియుక్తులు. కావున బభ్రువాహనుని తల్లియైన చిత్రాంగద పేరు చెప్పఁబడినది.

నటి : దీని నెవరు వ్రాసిరి ?

సూత్ర: చెలీ ! యెఱుఁగవా? పూడివాడ శ్రీ వేణుగోపాల సేవాశ్రమాధిపతియు, మహర్షి శ్రీ వేంకటదాసస్వామివారి కుమారుండును, దర్క వేదాంతాది శాస్త్రములయందుఁ గృతపరి

శ్రముఁడును గవిభట్టారక బిరుదాంచితుఁడును విష్ణుదాసా పర నామధేయుఁడునగు మొవ్వ దాశరథి సూరిగారిచే వ్రాయఁ బడినది.

నటి : ఆర్యా! యీ నూత్ననాటకమును జూడవలయునని యభిలాషము గలుగుచున్నది సామాజికులతోఁ గలిసి కూర్చుండెద సెలవిమ్ము.

సూత్ర: సరే బాగున్నది. నీవులేక నేనెవరితోఁ గూడి ప్రదర్శింపవలయు?

నటి : నాకంటె నిపుణురాలు మా చెల్లెలు వసంతసేనతో.

సూత్ర: అబ్బో! ఆ పడుచుదానితో యౌవనము కొంత కడచన్న నేను తంటాలు పడలేను.

నటి : (సాసూయము) చాలులెమ్మా సరసప్రసంగము.

సూత్ర: ఏమట్లొక్కసారి మొగమంతయుఁ జిమ్మచీఁకటి గ్రమ్మినది?

నటి : (సవిలాసము) లైట్లు సరిగా వెలుఁగని చిమ్మచీఁకటిలేయది.

సూత్ర: పోనిమ్ము కాలమతిక్రమించుచున్నది. ధర్మజ హయమోక్షణ సమయ ప్రవర్తితంబైన వసంతఋతువును గూర్చి యొక్క గీతిఁ బాడుము.

నటి : చిత్త మట్లే కావించెద.

తే. రమ్యకిసలయ నేపథ్యరచనఁ గాంచి
కుసుమ నవరత్న భూషణకోటిఁ దొడిగి
యళులునాచార్యకమున లాస్యంబొనర్చు
లతలఁ దలయూఁచి మదిమెచ్చు క్షితిరుహాళి.

సూత్ర: ఏమీ! నీగీతి మాధుర్యము. ఒక్కసారి సభారంగము నంతయు నిశ్శబ్దత యలముకొన్నది. ప్రతిదినము విను నాకే యిట్లున్నది, యిఁక సామాజికులఁ జెప్పనేల? నిన్నిపుడెట్లు సత్కరింపవలయునో నాకుఁ దోఁపకున్నది.

నటి : భరతపుత్రా! సత్కారము నేనే చేయవలసి యున్నదిగదా.

సూత్ర: (స్మృతి నభినయించి) అవును నాటకవిషయమును జెప్పిన పిదప నేనడుగకయే కౌఁగిలించుకొనెదనంటివిగా. ఏదీ యొక్కసారి.

నటి : నిజమే నీవడుగకుండినంగదా. అడిగితివి గావున ననలే గల్లంతు.

(నిష్క్రమించి పోవును)

సూత్ర: అరే! పోనేపోయినది దీని జాణతనమేమనవచ్చును! (నిరూపించి చూచి) అదే పాండవ విదూషకుండైన శాండిల్యుఁడు వచ్చుచున్నాఁడు. వీని సాహాయ్యమున దీనిపనిఁ బట్టించెదఁగాక.

(నిష్క్రమించును)

ప్రస్తావన ముగిసినది.

---

# చిత్రాంగదా నాటకము

## ప్రథమాంకము

(విష్కంభము)

(స్థలము : హస్తినాపురమునందు నొకానొక వీధి)

(తలగుడ్డ, కొంకికఱ్ఱ, విభూతిరేఖలు, పొడుముబుఱ్ఱ వీనితో శాండిల్యుఁడు ప్రవేశించును.)

శాండి: (పరిక్రమించి పైకిఁజూచి) ఆహా ! యిప్పటికి వదలింది నాకీ శనిగ్రహబాధ, ఏలినాటి శని యేడేళ్ళన్నర అంటారు. వీడు నన్ను పదమూడేళ్ళు పట్టాడు. అండా, దండాలేని బ్రహ్మచారి ముండకొడుకును గనుక వక్రించి స్తంభించి తన పరాక్రమ మంతా నామీఁదఁ జూపాఁడు గాఁబోలు. పాండవులరణ్యవాసాని కేగింది మొదలు, నా నోటికింపైన పదార్థము తగులక నాలుక చచ్చి చచ్చి చవిటిపఱ్ఱ అయ్యింది వానినోట మట్టిగొట్ట. ఆ దుర్యోధనుఁడే నానోట మట్టివేసింది. చచ్చారుపో నానోరు గట్టిన పాపాన, ఆ పాపాత్ములు.

(సంతోష మభినయించుచు)

ఉ. పావనమై వెలింగె నల పాండునృపాలుని వంశరేఖ, దు
ర్భావులు కౌరవాధములు క్రమ్మందిరి బంధుయుతంబుగాఁగ, ధా
త్రీవలయంబు సర్వము గరిష్ఠ పథంబున, ధర్మ సూతికిన్
గైవసమయ్యె నేఁటికి జగత్త్రయవాసులు మోదమందగన్.

ధర్మనందనుని పట్టాభిషేకమురోజు మొదలు తీయ్యి నాస్వామి రంగా రామతీఁత, రోజూ సంతర్పణలే రోజూ సమారాధనలే, ఆ లడ్లు, ఆవడలు, ఆ అతిరసాలు, తినఁగా తినఁగా నాపొట్ట పెరిగిపెరిగి చిట్టుబొనమాదిరిగా తయారైంది. (ముందునకుఁ

జూచి) ఏమిటా జనము. గోల రేఁగుచున్నదే. ఈ చాకివాడలో నెవరో పోట్లాడుకొనుచున్నట్లున్నది. పోయి చూచెదఁగాక (పరిక్రమించును)

(చాకలి మల్లి. మగఁడు వేంకన్న, యొకరి చేతులొకరు పట్టుకొని కలిసి పాటపాడుచుఁ బ్రవేశింతురు.)

అఠాణారాగము ఆదితాళము

**పాట**

పల్లవి : కాఁపురమే కైలాసం

అనుపల్లవి : లోపాలుంంటే యిది మోసం

చరణము 1. మగనికి, ఆలికి మనసులు గలిసి
పగవారెవరూ పైఁబడకుంటే ॥కాఁపు॥

2. పాఁడీపంటా - బాగాడుంటే
కూడూగుడ్డా - కొఁఅవడకుంటే ॥కాఁపు॥

3. పిల్లాజెల్లా - పెకపెకమంటూ
ఇల్లూవాకిలి - చల్లగడుంటే ॥కాఁపు॥

శాండి : అడ్డదీలెక్క. అదీ దెబ్బ, బలేశాగా ఉంది. (దూరముగా నుండి యనుచుండును)

వేంక : (పాటనాపి) ఓసి మాయదారిపిల్లా! ఎంత బాగాపాడేసేవే. మా బాగావుంది. అదీ సీతస్సాదియ్య. నాటకాలకు బూటకాల కెళ్ళి చూచివత్తండావుగా మోలు. లేకపోతే యిట్టాపాడతా? నీ పాటకి నే నిప్పుడు బవుమానం చేసెయ్యాలి.

మల్లి : (అనాదరముగా) ఏంబవుమానమయ్యా? అన్నీ చేసినట్టేవుంది మనపని.

వేంక : బవుమానం చెప్పమంటావా? నీ తవలపాకంటి చెంపమీఁద ఒక్కముద్దెట్టుకుంటా.

మల్లి : (కోపముతో) బలే మొగోడివే నేనెట్టుకోనియ్యకే.

వేంక : మఱెట్టాగానె నీయబ్బడాల.

మల్లి : మఱి నువ్వొట్టేసుకో నే నెప్పుడు కల్లు, సారాయి, తాగను, జూదము ఆడను అని.

వేంక : ఓసి నీతల్లిసిగదరగ పిల్లా, రాత్రిరే యేసుకుంటిని గదంటే మళ్ళీ కల్లుముంతలో మూతెడితే నీకాలిచెప్పుతోఁ గొట్టమని, జూదమాడనని.

మల్లి : అట్టైతే ముద్దెట్టుకో.

వేంక : (ముద్దుపెట్టుకొనఁబోవును.)

మల్లి : (సగములో వారించి యవతలికిఁబోయి కోపముతో) ఛీ చచ్చినాఁడా। నీ సారాకంపు నువ్వు మారణంగాను. నేనెళ్ళనిఁక తాగనంటంటివే. (మొగము నావలికిఁద్రిప్పి) జాము ప్రొద్దెక్కేవఱకెల్లా యెప్పుడెళ్ళి తాగొచ్చాడో తాగొచ్చేసేడు. ఉద్దేగంలో నాకు సాయము చెయ్యకపోతేమానె, ఈ తాగుడుతో జూదముతో కొంపగుణ్ణమేస్తంటే యీ పిల్లలతో నే నెట్టా చచ్చేటట్టు ?

శాండి : (దూరముననే యుండి) ధూద్దెబ్బ తాళం మాఱిందే.

వేంక : (తూలుచు) అదుగంటుకే మనిసికి మంటెత్తేది నే. ను. తాఁగ లేదంటే తాగా వంటదీ.

మల్లి : నువ్వు తాగింది లేనిదీ కనపడతానే వుంది. మనుముకి వచ్చిన రావడంతోనే ఒకకాయ సారా పోయించేవఱకి యింకేం గావాలి మాఅయ్య సచ్చినోడు, ఈ దొంగ ముదనష్టపోడికి కట్టిపోయాడు నన్ను. ఆడి నాలికపీక.

వేంక : ఏమ్! దొంగ ముదనష్టపోడూ! నోటికి ఖాళీగా రానియ్యి యీపి యిమానంమోత మోగుద్ది.

మల్లి : తాగిందిగాక యీపియీమానం మోత మోగుతుదంట (ముందు నకు వెరిగి) •నీతాత దిగిరావాలి రా అయినా

వేంక : (కళ్లెఱ్ఱజేసి జుట్టుపట్టుకొని యీడ్చుచు) తన్నితే దీనితాత యెవుడడ్డ మొస్తాడో చూస్తా.

మల్లి : ఈ బండసచ్చినోడు నన్ను చంపేసేడు చంపేసేడట్లో (కేకలు వైచును)

(కోటన్న రామన్న ప్రవేశింతురు)

కోట : (జుట్టు విడిపించి) ఒరేవెంకన్నా ! యేంటోసె యీ యల్లర.

రామ : ఆడదాన్ని కొట్టబోతావేందిరా.

వేంక : కాదురా మావాఁ ! యీ సన్నాసి మొకందానితో నేను పడే టట్టు లేదోసె.

మల్లి : అవును పడలేవు. చూడండయ్యా ! మీరంతా యిట్టాగే కాపరాలు జేసుకొంటన్నారూ ? ఊళ్లో కెళ్లడు. ఉద్దేగంలోకి రాడు. సాకి రేవులో కసలేరాడు. తాగటం తలకిపోసుకోవటం. అక్కడనుంచి ఆ పేరయ్యగారి చావిట్లో జేరి పొద్దస్తమానం ఆడటం. అదేమంటే నన్ను కొట్టరావటం. ఇదేనా కాపరం జేసుకునే లచ్చనం? సాటికులపాళ్లు వచ్చారు, మీరైనా గెడ్డిపెట్టండయ్యా.

వేంక : నువ్వా పెడతావు గెడ్డి; నే నుద్దేగంచెయ్యనే.

రామ : ఉద్దేగమంటే వూరగాయ కుండంటిది. చేసుకోకపోతే మనము బతికేదెట్టాగురా యెంకన్నా !

వేంక : నేను చెయ్యనురా మావాఁ! చిన్నప్పుడు నేను బళ్లో నాలుగు గలాసులుదాకా చదివా.

శాండి : ప్రొద్దున వేసుకొన్న రెంటితో మొత్తం మాలుగలాసులు.

వేంక : తరవాత అప్పలాచార్లు దగ్గిర మూడు నెల్లు నేరుసుకొన్నా సంతకం ఇంతాజదివి గుడ్డలుతుకుతానంటొనె.

కోట : (అపవారించి) ఉద్దేగం జేయడంట. ఊళ్లేలతాడుగావాలు. ఎదవసన్నాసి (ప్రకాశముగా) గుడ్డలుతకపోతే మాత్రం పెళ్లాన్నెందుకురా కొట్టం ?

వేంక : అన్నె సటోటా యీడిపెళ్లాం యీణ్ణి యీదిలో బడేసి తన్నతూవుంటే ఆదోవనోస్తా నేనన్నిసాల్లో యిడిపించా.

(కోటన్న వెనుకకుఁ దగ్గును)

శాండి : (ముందునకు వచ్చి) ఏమిటిరా వెంకన్నా యీ యల్లరి బంగారంవటి పెళ్లాము, నీవు చక్కగా కాపురం చేసికొనే దానికి, ఈ త్రాగటమేమిటి ? ఆ జూదమాడటమేమిటి ? ఈగోల యేమిటి ?

వేంక : ఎవురొనె యీ యన; (చూచి) అల్లా రాజుగారింటో ఉండే బేప నాయనా !

శాండి : అవునురా ! యిట్లైతే నీపిల్లలేమవుతారు ? నీవేమవుతావురా సన్నాసీ !

వేంక: నేను తాగేది తాగేదే. మాలావు చెబుతున్నావుగాని ఎక్కడన్నా పాప్పన్నమంటే నువ్వు మాత్తరం పరిగెత్తవంటయ్యా, రత్తాలుదీనే పచ్చిరత్తాలుదినాలి ముత్తేలుదినే పచ్చిముత్తేలు దినాలయ్యా పిచ్చిబేమ్మడా !

శాండి: సరిపోయె (సభవైపునకుఁ దిరిగి) ఇంకా వీనికేమిటి సమాధానంచెప్పేది? కటకటా యీ త్రాగుడువలన నిక్కెంతమంది చెడిపోవుచున్నారు లోకమున! అలవాటు పడకేయుండవలె గాని పడినపిదప, ఈ దుర్వ్యసనమును మాన్పవలెనన్న బ్రహ్మదేవుడు దిగివచ్చినా తరముకాదు. ఈ మనుష్య పశువులకస లేమి టీత్రాగుడు? ఏమి పురుషార్థమును సాధింపఁగోరి దీనిని

సేవించుచున్నా రీమూఢులు ?  రుచిజూతమా  కాలకూట
విషంబున కించుకంత తక్కువ. సువాసనకు అందుమా త్రాఁగిన
వాఁ డెదురువచ్చిన మంచివాఁడు పంచకొంగు ముక్కున కడ్డము
పెట్టుకొని మాట్లాడవలెను. బలమునకన్న చో మత్తున్నంతసేపు
కొంటెగంతులు వేసినా నిషాదిగిన పిదప మిగులనూరిన గోఁగుల
వలెఁ దేగుడు కాఱిపోవుచున్నారు. గౌరవ ప్రతిష్ఠలకు అందుమా
ఈ త్రాఁగుఁబోతుల గౌరవ మెంతని చెప్పవచ్చును? తప్పత్రావి
స్పృహదప్పి వీధిలో గుడ్డాగోచీ లేక కక్కుచూ మూల్గుచూ
పడియున్న వీరినిఁజూచి చిన్నా పెద్దా నలువురూ ఛీఛీ యని
ఛీత్కారములతోఁ గొనియాడుట యెంతటి గౌరవాస్పదము !

కోట : బేపన అయ్యగోరు చెప్పిందంతా అచ్చరాలా నిజము.

శాండి: ఉత్తముఁడూ, నీచుఁడూ తెలివిగలవాఁడు, తెలివి లేనివాఁడు
ధనవంతుఁడు, ధనహీనుఁడు అనే భేదములేక మహా వ్యాధి
వలె ఈ మద్యపానపిశాచ మందఱి నావేశించుచున్నది. కోటీ
శ్వరుల కొంపలు సైత మీ పానమువలనఁ గూలిపోవుచున్నవి.
ఉక్కుగుండ్లవలెనుండు పడుచువాళ్ళెందఱో దీని విషము నర
నరమున కెక్కి శరీరధాతువుల నెల్ల శోషింపఁజేయఁగా బల
హీనులై నీరువచ్చి వదులువదులుగాఁగట్టిన వరిగడ్డి మోపులవలెఁ
తయారగుచున్నారు. అచిరకాలమున నకాలమృత్యువు వాతఁ
బడుచున్నారు. అక్కటా ! యీ కల్లుసారాయముల కలవాటు
పడి యున్మత్తులవలె సంచరించుచున్న భర్తల బ్రతిమాలి
బ్రతిమాలి, మరలింపలేక యెంతమంది కల్పలతలవంటి కాంతామ
తల్లులు కన్నీళులు కాలువలై ప్రవహింప నేకారుచున్నారు !
తల్లిదండ్రులు తమకై తపించి మంచాలు పట్టినను, ఆలుబిడ్డ
లాఱాటించుచున్నను, ఆస్తిపాస్తులడగారినను, కులప్రతిష్ఠలు
కూలిపోయినను, మృత్యువు ముందఱికివచ్చి తొంగి చూచు
చున్నను, చిన్నవారు సైతము ఛీ ఛీ యనుచున్నను, ఈ
త్రాఁగుఁబోతులు మాత్రము, త్రాగుడుమానరు, మానరు,
ఓ పానపిశాచమా నీమహిమ యెంతనవచ్చును !

రాము: సాత్తుర్లుగారు నూరేళ్లు బతుకుతాడు. అంతా సత్తెమే అంతా సత్తెమే.

మల్లి: మాబాబే! అట్టాగే పెట్టయ్య! యీ తప్పటోళ్లకి గడ్డి.

శాండి: మంచీలేదు చెడూలేదు. కొందఱు వైద్యశిఖామణులు సైత మీమాత్రాగుడువలన రోగుల ప్రాణము లన్యాయ్యముగాఁ దీయు చున్నారు. నటకశ్రేష్ఠులు నాట్యరంగమునఁ దబ్బిబ్బులు గాయు చున్నారు. ఇహమూలేదు, పరమూలేదు. ఈ త్రాఁగుఁబోతు లకు మాత్రము సర్వనాశము తప్పదు.

సీ. తాతతండ్రులనాఁటి ధనము లాహుతిసేయు
ప్రళయాగ్నికీల యీ పానశాల
నరనరంబునకెక్కి నాశంబుఁగావించు
పటువిషజ్వాల యీ పానశాల
మానాభిమానముల్ మాయించి పీడించు
బలుగండమాల యీ పానశాల
పుణ్యమార్గమువంకఁ బోనీక బంధించు
పాపాలమూల యీ పానశాల
కావునను స్వప్నమందైనఁగాని దీనిఁ
దలఁపఁబోలదు సుమ్ము నా తమ్ములార!
బ్రతుకఁగోరికయున్న నా బంధులార!
వలదువలదుర పానంబు వలదువలదు.

ఇంకా దీనికిఁదోడు జూదముగూడ నున్న నింకఁ జెప్పవలసిన దేముంది ఉత్తమజాతుల వారమని విఱ్ఱవీగువారే యిప్పుడీ జూదముతో చీట్లపేకలతో బంగారమువంటి కాలమును వ్యర్థ ముగాఁ గడపుచున్నారు. ఏమి వీరి మందభాగ్యత!

వేంక: ఏందోనె యీ యెట్టినాయాలుగోల. పెళ్లీపేరంటంలేని సన్నాసి. ఆరాజుగారి ఆత్తానంలోబడి ఆ టేటింటంటే పిఱ్ఱబలిసిందల్లేవుంది. జాము సేపుటినుంచీ చూత్తన్నా. అది తాగన్లాడదంటాడు ఇది

తాగ్గూడదంటాడు, ఆ కల్లులోమజా యీయనకేం దెలిసింపంట. (శాండిల్యుని వైపునకుఁ దిరిగి) ఏవయ్యా బేమ్మడా! జూద మాడగూడ దన్నావుగిందఁ. దరమరాజులువోరు యెందు కాడారు మఱి. అట్టాటి అట్టాటి మాప్పెబువు లాడతంటే లేదుగాని మేమాడితే వచ్చిందేంటి?

కోట: ఓసి యిక వీణ్ణి తన్నంది కుదరదురా రావన్న బావా.

వేంక: మీరేనా యింకోళ్ళన్నావత్తారురా? అసలు నా సంగతెటుగ రట్టుంది. ఆ దరమరాజులవోరుగినక ఆగుడ్డిమారాజు కొడుకుల నంతా అడ్డమొచ్చేవఱకి గొంతులుగోసి తగుతెక్క ఎట్టా ఏలు కొంటన్నాడు. అట్టా మిమ్మల్నందఱ్నీ నఱికి, యీ చాకలి పల్లంతా యేకగ్గీవంగా యేల్తామురేందనుకొంటున్నారో.

శాండి: ఛీ ఛీ ఆ ధర్మైకమూర్తిని, భరతవంశోత్తముని సకలరాజన్య మకుటాయమానుని నజాతశత్రునిఁ గూడ దూషించుచున్నాఁడీ నీచుఁడు. ఇఁక నిచ్చటనుండరాదు.

(తెరపడును)

(అందఱు నిష్క్రమింతురు)

(శాండిల్యుఁడు మరలఁ బ్రవేశించును)

శాండి: (తనలో) తుచ్ఛుఁ డెంతెంతమాటలన్నాడు! వెఱ్ఱినాయాలు నఁట పెళ్ళిపేరంటములేని సన్యాసినఁట, పిఱ్ఱిబలిసిందఁట. ఛీ వీని నేమిచేసిన నిప్పుడు నా కక్షతీఱును. మంచికిఁబోతే చెడు వెంటనే వస్తుందన్నమాట నిజమయ్యింది. వీని వాక్యములు నాకు శూలములై హృదయమున నాటినవి. అప్పుడే కొంకి కఱ్ఱతో రెండు లాగుదామా అని చూచానుగాని, వాఁడు తిరుగఁబడి పది లాగుతాడేమోనని జంకాను. సాక్షాత్తు ధర్మ మూర్తియగు, నా ధర్మనందనునిఁగూడ నిందించినాఁడీతులువ. (వ్రేలుకొట్టి) ఆ! స్ఫురించినది. దూషించిన విషయము నా మహారాజుతోఁ జెప్పి వీనిని దండింపఁజేసెద.

(ఆలోచించి) ఈ నిందావాక్యముల నా రాజపుంగవునితో జెప్పితే వ్యథపడునేమో ? పడుగాక చెప్పక యుండలేను. ఇంతటిమాట విని దాచిన నాకడుపుబ్బియుబ్బి కదన భేరియగును.

పెళ్ళీపేరంటమూ నాకు లేనిమాట నిజమే ఐనా ఆమాటన్నందువలన నాకు బాధ కలుగుతూనే ఉంది. ఉన్నదోషము నున్నదన్నా కష్టమే. లేనిగుణమును లేదన్నా బాధే, ఇదినైజము నాకు పెళ్ళిలేనికతన నిట్టి హీనులకుసయితె మెగతాళియైనది. నేనుమాత్ర మెందుకు బెళ్లియాడగూడదు ? అందఱివంటి మగవాడనుగానా ? నాకు మాత్రము పిల్లనిచ్చువారు లేరా?

(నే ప థ్య ము లో)

ఎందుకు లేరూ ? అందఱూ వారే నీదగ్గఱనున్న మూట జూచిన వారు పిల్లనీయ కేమిసేయుదురు ?

శాండి: (తెరపై పునకుఁ దిరిగి) ఆ! అప్పుడే మెవరో పరిహాసము జేయుచున్నారు. నా పెళ్లిసంగతి యెత్తగానే యీ లోకులకు ఎగతాళి. నాదగ్గఱ మూటలేదనియా ? ఇదే నామూట. (బొడ్డులోనుండి పొడుముకాయఁ దీయును)

తే. మూఁతిడిప్పయు వెండి యీ మూఁత వెండి
వెలయ రెండింటికతికిన గొలుసు వెండి
చిత్రచిత్రంబు దీని చారిత్ర మెల్లఁ
గడుపులోపలఁ దొట్టి నా పొడుముబుఱ్ఱ.

వనితలు వలచుట కింతకంటె యేమిగావలె? (ఆలకించి) అదె ధర్మజు నాస్థానఘంట రాజపురుషులఁ బిలుచుచున్నట్లు మ్రోగుచున్నది. ఆ మహారాజు కొలువిచ్చెఁ గాఁబోలు. పోయి యీ విషయముఁ జెప్పెదఁగాక.

(నిష్క్రమించును. తెరపడును)

(ఇది విష్కంభము)

## 1 - వ రంగము

(ఆస్థాన మంటపమున ధర్మజ భీమార్జునులు సింహాసనములపైఁ గూర్చుండి యుందురు)

అర్జు : అన్నా! భీమసేనా! నేఁటికిఁగదా నా కన్నులు చల్లబడినవి. ఇట్లు మహనీయ సింహపీఠి నలంకరింపఁదగిన యన్నగారు, పదుమూఁడేండ్లు ఘోర కాంతారముల యందుఁ బలుబాముల పడుచుండఁగాఁ జూచి నాహృదయ మెంతగానో దహించుకొని పోయినది.

మ. చతురంభోనిధి వేష్టితాఖిల ధరాచక్రంబుఁ బాలించు, భూ
పతి యీ ధర్మసుతుండు సోదరులుగొల్వన్ బాదసంచారియై
గతి కన్పింపక దారుణాటవుల దుఃఖంబొందుటల్ సూచినన్
వితతోద్గీర్ణ నవాంబుపూరములు కావే కన్ను లెవ్వారికిన్.

భీము : అర్జునా! నీ పలికిన దెంతయు సత్యము. అందును బండ్రెండేండ్ల యరణ్యవాసమంతయు నొక యెత్తు. కడపటి యజ్ఞాతవాస సంవత్సర మొక యెత్తు

సీ. జగదంతరాళంబు జయవెట్టగా రాజ
సూయంబుఁ జేసిన శూరవిభుఁడు
క్రతుదక్షిణల సముద్ధతి మహీసురకోటిఁ
దనిపి ప్రోచిన యట్టి ధర్మమూర్తి
తన యాజ్ఞ ధారుణీ మనుజేంద్రులకు శిరో
భూషఁ గావించిన పుణ్యశాలి
ప్రత్యేకగుణముల భరతవంశము నెల్ల
వెలిఁగింపఁగల్గిన విమలయశుఁడు

దానవారాతి మన్నించు మేనమఱఁది
యిట్టి మహితాత్ముఁడటఁ గంకభట్టనంగ
బీదబాపనివడువునఁ బేర్మితఱిగి
కొలిచె నొకయేఁడు విరటునిఁ గూర్మితోడ.

విధివిధానంబు దాఁట నెవ్వరికిఁ దరంబుగాదు. ఈ కష్టముల కెల్లఁ గారణమైన దుర్యోధనుఁడు రణాంగణమునఁ దొడలు విఱిగి పడియుండగాఁ జూచిన పిదపఁ గదా నా హృదయజ్వర ముపశమించినది.

ధర్మ : తమ్ముఁడా! భీమసేనా! నీ హృదయజ్వర ముపశమించినది గాని నా విషాదానలము చల్లాఱు నుపాయము లేదుగదా.

అర్జు : అన్నా! ధర్మనందనా! ఏమట్లంటివి? ఆపత్సముద్రముల నుత్తరించి సర్వసుఖాస్పదమైన రాజ్యపాలనమున కుపక్రమించిన నీకు విషాదానల మెందులకు?

ధర్మ : (సవిషాదము) సకలబంధుక్షయముఁ జేసి యన్నయైన కర్ణునిఁ జేతులారఁ జంపించి మహాపాతకమున కొడిగట్టిన నాకెక్కడి సౌఖ్యమోయీ! తండ్రీ!

సీ. మహిత చారిత్రనిర్మలయైన పెదతల్లి
        గాంధారి యుదరంబుఁ గాల్చినాఁడ
బాల్యంబునుండి సంభావించి పెంచిన
        కురుపితామహు నేలఁ గూల్చినాఁడ
శంకయించుక లేక బొంకాడి ధనురేక
        గురుని ప్రాణము లూడఁబెఱికినాఁడ
భరతవంశ స్త్రీల భవ్య మాంగల్యముల్
        గంగ రేవునఁ ద్రెంపి కలిపినాఁడ

నాకతంబునఁ బొలిసె నీ లోకమెల్ల
నట్టి నాకేటి రాజ్యసౌఖ్యంబులయ్య!
వెడగు పాపంబులిన్ని గావించుకొఱకు
నన్ను సృజియించెఁ గాఁబోలు నలినభవుఁడు.

నాల్గు యుగంబులయందును నావంటి మహాపాతకుఁడు మ[illegible] కొకఁడు లేఁడు.

భీము : (అపవారించి) ఈ మహారాజున కీపిచ్చి యింకను వదలలేదు గాఁబోలు. (ప్రకాశముగా) రాజోత్తమా! సకల ధర్మము లెఱిఁగిన నీవిట్లు పలికిన మేమేమి చెప్పఁగలము, పుణ్యపాపము లకుఁ గర్తయైన వనజోదరుని ముందుఁబెట్టుకొని మన మీయుద్ధముఁ జేసితిమి. ఆశ్రితపక్షపాతియైన యాతని కటాక్షమున మన కేపాపము నంటదు.

ధర్మ : అవును. ఆ పాంచజన్యధరుని మాట నతిక్రమింపలేకయే నేఁ సింహాసన మెక్కితిని. కాని యీ సర్వబంధు దాహదోషము, నా మానసమున నానాఁటికిఁ బ్రజ్వరిల్లి భయానకస్వరూపమును దాల్చుచున్నది. దానిని మాపుకొనవలెనని ప్రయత్నించినను నావశము గాకున్నది.

భీము : చిరకాలము పడరానిపాట్లుబడి క్షాత్రోచితముగా వైరి వినాశము నెరపి యిప్పటికి నఖండ సామ్రాజ్యలక్ష్మీ సంపన్నుఁడ వయ్యును నూరక యిట్లు విషాదపడిన మాన్యులైనవారు సంతసింతురా?

ధర్మ : ఎట్లును సంతసింపరు, మహాత్ముల మార్గముఁ దప్పి యుత్తమ లోకములకు దూరుఁడనైన నా కెక్కడిది మాన్యుల మెప్పు కోలు?

ఉ. అన్ననుజంకి క్షోణితలమంతయు క్షత్రియ రక్తవాహినీ
క్లిన్నముఁజేసి బంధుగుల గీటడఁగించియుఁ బూజ్యకోటికిన్
గన్నుల నీరునింపి యొక కైవడి రాజ్యము నేలఁగాంచి, సం
పన్నుఁడనైతి నన్నఁదగు మానిసులెవ్వరు నన్ను మెత్తురే.

ఇంతటి ఘోరకర్మము నొనరించిన నన్ను సూర్యచంద్రు లున్నంత వఱకు లోకము నిందించుచునే యుండును.

అర్జు : (అపవారించి) అబ్బా యీ మహానుభావుని హృదయ మెంత మెత్తనిది! (ప్రకాశముగా) రాజైనవాఁడు రక్తపాతము

సేయక వైరుల వధింపక దుష్టుల శిక్షింపక నిజధర్మము నెట్లు నిర్వర్తింతును. నిజధర్మాచరణము దోషావహము కాదు గదా.

భీము : రాజచంద్రా! బంధువధముఁ జేసితినని విలపింతువు. ఎక్కడి బంధువులు ? పెదతండ్రి కొడుకుల నూరక రాజ్యలోభమునఁ జంపితిమా ? యుద్ధము వలన సకలజనక్షోభము గలుగునని నీ వెంత శాంతి వహించినను మహాపాపియైన సుయోధనుఁడు సంధిసేయ నంగీకరించెనా ? వారొనర్చిన పాపమే వారిని బలిదీసినది. ఆ కౌరవులు బాల్యమాదిగా మనకొనర్చిన దుర్ణయముల కంతము లేదు.

సీ. దేశంబు వెడలించి కాశికానగరికి
నెట్టి కొంపకు నిప్పుఁబెట్టినారు
కైతవద్యూతంబుఁ గల్పించి మాయాబ
లమ్మున రాజ్యంబు లాగినారు
సవనాగ్నిసంభూత సాధ్వి ద్రౌపదిఁబట్టి
మానభంగముఁ జేయఁ బూనినారు
పయిపుట్టములఁగూడ బల్మిమై హరియించి
దారుణాటవులకుఁ దఱిమినారు

ఇన్ని వడియును సంధిసేయించుకొఱకు
వనజనాభుని నీవు పంపంగ వాఁడి
సూదిమోపినయంతైన క్షోణితలముఁ
బంచి యీమని రెంతటి బంధులకట !

ఇట్టి కౌరవులే బంధువులైన నింకఁ బగవారెవరు ?

అర్జు : కౌరవులు నిమిత్తమాత్రులు. మన విపత్తుల కన్నిటికి మూల కారణము కర్ణుఁడు. అన్నయని తెలిసినపిదప మనమిట్లు విచార పడుచుంటిమిగాని, యతఁడు మనము సహోదరులమని యెఱిఁ గియు దుర్యోధనాభిమానియై జంకులేక యెదిర్చినాఁడు. దైవగతి యిట్లున్నది. భీష్మద్రోణాదులు పూజ్యులేయైనను కౌరవుల

పక్షమున వచ్చుటచేఁ గొట్టవలసి వచ్చినది. ఇంతకు క్షాత్ర ధర్మ మిట్టిది.

ధర్మ : తమ్ములారా! క్షత్రియ ధర్మ మెట్టిదైన నగుఁగాక. ఒకానొక కారణమున విరోధము వచ్చిన మాత్రమునఁ గౌరవులు మన పెదతండ్రి కుమారులు గాకపోరుగదా. వారు ద్రోహము చేసి రన్న మన మొనర్చిన మహాకార్యముమాత్ర మేమున్నది? క్రోధమునే ప్రధానముగా నవలంబించుటఁ జేసి సకలబంధు క్షయము సంపాదించితిమి.-

సీ. శౌర్యాదిగుణముల జలజనాభునిసాటి
యల సుభద్రాపుత్రుఁ డంతరించె
నుద్ధతాపదల సముద్ధరించిన ఘటో
త్కచుఁడును మేదినిఁ గలిసిపోయెఁ
జుట్టంపుమేరువుల్ శోభనాకాంక్షులు
ద్రుపదవిరాటులు ద్రుంగినారు
చిచ్చఱపిడుగులు సింహకిశోరముల్
ద్రౌపదీసూనులు దగ్ధమైరి
బావమఱఁదులు తెగిరి సంబంధి జనము
లీల్గిరైనను ధారుణి యేలుకోర్కిఁ
గొమ్మలన్నియు విఱిగిన కుజముపోల్కి
బ్రతికియున్నాఁడ రాజ్యాశపాడుగాను.

దురాశ మనుష్యునిచే నెంత ఘోరకృత్యమైనను జేయించును.

## 2 - వ రంగము

(శాండిల్యుఁ డేడ్చుచుఁ బ్రవేశించును)

శాండి : ప్రభూ! ధర్మనందనా! రక్షించు రక్షించు (వెక్కి వెక్కి యేడ్చుచు ముందు వెల్లికిలఁబడును)

భీమార్జునులు : (ఆశ్చర్యముతోఁ జూతురు)

ధర్మ : (విషాదాశ్చర్య సంభ్రమములతో) విప్రోత్తమా! నీకేమి యాపత్తువచ్చినది ?

శాండి: పెద్దాపత్తు కొండంత ఆపత్తు.

ధర్మ : కొండంతదానిని గోరంతగాఁ దీసివేయుదును. లేచి కూర్చుండి చెప్పుము, మీబోటి సుజనుల యాపత్తులఁ దొలఁగించుటకే యీ భరతవంశోత్తములు కిరీటమును ధరించుట, సొగసునకుఁ గాదు గదా (లేపి కూర్చుండఁబెట్టును)

శాండి: అబ్బా! నాకడుపుబ్బిపోతున్నది. (కడుపువంకఁ జూచుకొనుచు నుబ్బించును.)

అర్జు : మిత్రమా శాండిల్యా! నీకేమి బాధవచ్చినది ?

శాండి: (అర్జునిని వంకఁజూచి) అర్జునా! నేనంటే అంత మొగతాళియా. ఏమట్లు నపుంసకలింగము వేసి పిలుస్తున్నావు. నాకు పుంలింగము పనికిరాదా ? (ఏడ్చును)

అర్జు : పిచ్చి బ్రాహ్మణుఁడా! మిత్రమాయనినను మిత్రుఁడాయనినను నొకటియే, ఏల యశ్లేడ్చెదవు నీకు వచ్చిన బాధయేమి ?

శాండి: (కడుపునంకఁ జూచికొని) ఇంకనూ నాకడుపుబ్బిపోతున్నది. పగిలిపోతుందో యేమో ?

భీము : (అనాదరముగా) ఈ చపలుఁడెచ్చటనో తేరగావచ్చినదని మితి మీఱి తిని యాయాసముతో నిట్లు బాధపడుచున్నాఁడు. అంత కంటె నేముండును. వడ్లగింజలోనిది బియ్యపుగింజ.

శాండి: భీమసేనా! నీ వెప్పుడూ అట్లే అంటావు. నేనిక బ్రతకను. నాకడుపుబ్బిపోతున్నది.

భీము : నాగదాదండము మడమతోఁ గొంచెము నొక్కి పెట్టమందువా? కడుపుబ్బక యుండును. (అపవారించి) అంతపని జరిగెడిదే అన్నగారుండిపోయిరి.

శాండి: అవును బంధుహత్య అయ్యింది. ఇఁక బ్రహ్మహత్య గూడ చేయుము.

అర్జు : శాండిల్యా! ఏల యట్లార్తిపడెదవు. కడుపుబ్బుట యేమిటి బ్రతుకకపోవుట యేమిటి?

శాండి: ఇంక నేను బ్రతకను. అర్జునా! నా పెళ్ళాం బిడ్డల్ని ఎట్లా కాపాడు తావో

భీము : పెండ్లాముబిడ్డ లెక్కడనయ్యా నీకు?

శాండి: ఓహో దుఃఖములో మఱచిపోయాను. అందఱికి మాదిరిగానే నాకూ ఉన్నారు కాబోలు ననుకొన్నాను.

ధర్మ : శాండిల్యా! యేల యట్లు బాధపడి మమ్ము బాధపెట్టెదవు. ధైర్యమవలంబించి విషయముఁ జెప్పుము. నీ కెవరివలన బాధ కలిగినది?

శాండి: ఎవరివలన గాదు. ఈ వేళ పురము వీధిలో నొక నిందావాక్యము విన్నాను. దాన్ని చెబితేమీాకు బాధ. చెప్పకుంటే నాకు కడుపుబ్బ బాధ

అర్జు : నిందావాక్య మెవరినిఁ గూర్చి?

శాండి: (మెల్లగా) ప్రభువుగారినిఁ గూర్చి.

భీము : అయిన నీకుఁ జెప్పవలదు లే పొమ్ము.

శాండి: అయ్యోరామ! మొదటే చెప్పాను. అది చెప్పటానికి వీలుపడదు. చెప్పకపోతే నాకు కడుపుబ్బి పగిలిపోతుందని. నాకడుపు పగిలిపోతున్నది పోతున్నది. (ఏడ్చును)

ధర్మ : బ్రాహ్మణోత్తమా! నీవు బాధపడవలదు. ఎట్టినిందా వాక్యమైనను నీకుభయము లేదు. చెప్పుము. సకలబంధువధముఁగావించి మహా పాతకుఁడ నైన నాకు నిందా వాక్యములుగాక ప్రశంసా వాక్యము లెచటినుండి వచ్చును? వినక యెట్లు పోఁగలదు.

శాండి: మఱి చెప్పితే యువరాజుగారికి కోపం వస్తుందేమో: (భీముని వంకఁ జూచును)

ధర్మ : నేనుండగా నీకేమియు భయము లేదు. సర్వమును జెప్పుము.

శాండి: నేనీవేళ వీధిలో వస్తావుంటే చాకలి పల్లెలో ఇరువురు ఆలు మగలు పోట్లాడు కొనుచున్నారు.

అర్జు : ఎందులకో పోట్లాట?

శాండి: మగడు జూదమాడు తాడట. అది మానమని పెళ్లామూ, మాననని మగడూ పోట్లాడుకొంటున్నారు.

భీము: ఆతగవుఁ దీర్చుటకు నీవటకుఁ బోలేదుగదా,

శాండి: సరిసరి బాగానేవుంది. నేను వెళ్లకపోతే మఱి అలాంటి వీధి పోట్లాటలకు తీర్పిచ్చేవాళ్లెవరు? పోవలసిందే. వాళ్లు విన్నా వినకపోయినా తీర్పు చెప్పవలసిందే, పోకుంటే పరోపకార ఫల మెట్లా లభిస్తుంది?

అర్జు : అవును. నీవంటి యుత్తములకెల్ల నదియే లక్షణము.

శాండి: ఉత్తముడనుగానీ గిత్తముడనుగానీ నాకది స్వభావము.

ధర్మ : నిజము. స్వభావము దురతిక్రమము. తరువాత నేమిజరిగినది?

శాండి: అంతట నేను వానికి జూదమాడగూడదని చీవాట్లు పెట్ట బోయాను. వాడు కళ్లెఱ్ఱజేసి ధర్మరాజుల వారంతటివాడు జూద మాడగా నేనాడితే తప్పేమిటని పైకి వచ్చాడు.

ధర్మ : (నిట్టూర్పు నిగిడించి) నీచుల కుపమానభూతుఁడనైతిని, ఛీ పవిత్రమైన భరతవంశము నావలనఁ గళంకితమైనది.

అర్జు : వాఁడేమైనఁ ద్రాగి యుండెనా?

శాండి: త్రాగనూలేదు చావనూలేదు. పైగా మహాలోకమాటన్నాడు. సుయోధనాదుల గొంతులు నిష్కారణముగా గోసి యీ మహారాజు గద్దె యెక్కినాడట.

భీము : ఛీ దౌర్భాగ్యుఁడా! ఆపనికిమాలినవాని కూఁతల నిచట నేల చెప్పెదవు? (కోపముతో) నీవసలచటికేల పడిపోయితివయ్యా?

శాండి: సరేయిక. ప్రొద్దున ఎనిమిది గంటలకు పోరుంబాకవారింటో గర్భాధానమంటే సంభావనకు పోయాను. త్రోవలో ఇది జరిగింది. సంభావనకుగూడా పోవద్దంటావా యేమిటి?

భీము : ఉదయ మెనిమిదిగంటలకు గర్భాధాన మేమిటయ్యా?

శాండి: (వ్రేలుకఱచి యపవారించి) అబద్ధమాడబోతే అతికిచావదు: (ప్రకాశముగా) కన్యాదానము గాబోలులే గార్భాధానమని పొరపాటునవచ్చింది.

భీము : అసలే మండుచున్న యగ్నిహోత్రములో నాజ్యాహుతి వేసినాఁడీ నిర్భాగ్యుఁడు (కోపముతో శాండిల్యునివంకఁ జూచును)

శాండి: ఆజ్యాహుతో పూజ్యాహుతో విన్నమాట చెప్పాను. (ఆత్మగతము) రాజుగారితో చెప్పి వానిని దండింప జెయ్యాలని వచ్చాను నేను. ఇక్కడేదో జరిగిందే. నేనింక ఇచ్చటవుండటం భావ్యంగాదు. (నిష్క్రమించును)

ధర్మ : (విషాదముతోఁ దలవాంచి) మందభాగ్యుఁడనగు నాకీ యుద్ధాభిలాష మేల కలుగవలయును?

అర్జు : అన్నా! ఎవఁడో యొక నీచుఁడు పలికినమాటలను సైతము పాటిచేసి నీవిట్లు చింతపడిన మేమేమి చెప్పఁగలము.

ధర్మ : ఇందులో నీచత యేమున్నది. నేను జూదమాడిన దసత్యమా? దుర్యోధనాదులసంహరించిన దసత్యమా? రెండును నిశ్చయమే.

భీము : సత్యమేమైనను రాజధర్మము ననుసరించి చేసితివిగాని యీ నీచుఁడు పలికినట్లు లింద్రియలోలతచేఁ గాదుగదా.

ధర్మ : ఎట్లైనఁగానిమ్ము బంధుమరణ శోకాతురుఁడనైన నేనీ యప యశోభారమునుగూడ భరింపఁజాల, మునినై వల్కలముల ధరించి యరణ్యములకేగి తపంబొనర్చి పాపముఁ బాపికొనెదను.

భీము : అట్లయిన మేమును నీవెంటనే వత్తుముఁగదా.

ధర్మ : తండ్రీ భీమసేనా! ఆ యరణ్యవాసక్లేశమును సుకుమారులైన మీరు భరింపఁజాలరు. మునుపు మిమ్ము బాధపెట్టినందులకే నాహృదయము తపించినది. ఐనను మహాపాతకుఁడనైన నాకే వనవాసము విధివిహితమైన ప్రాయశ్చిత్తమై యున్నది గాని మీకేల ? వత్సా! ధనంజయా! భీమునకు రాజ్యాభిషేకముఁ జేసి నీవు యువరాజవై ధర్మమార్గమునఁ బ్రజాపాలన మొనర్పుఁడు. అరణ్యాగమనమునకు నాకనుజ్ఞయిండు. దుర్జాతుఁడనైన నేనుండగా మీకును సుఖంబుండదు. జాగరూకులరై రాజ్యభోగము లనుభవింపుడు.

సీ. గర్భార్తి గ్రాఁగుచుఁ గనిపెట్టికొనియున్న
 గాంధారి ధృతరాష్ట్రుఁ గావరయ్య
పుత్రునన్గానక పొరిఁబొరివగచు కుం
 తీమహాదేవులఁ దేర్పరయ్య
భండనంబునఁబడ్డ భరతరాజన్యుల
 పొలఁతుల మన్నించి బ్రోవరయ్య
దేవతాభక్తియు దీనపోషణమును
 నిరతంబుమదిలోన నిలుపరయ్య

కన్నప్రజవోలె లోకులఁ గరుణతోడ
మనిచిసత్కీర్తి దిక్కుల నినుపరయ్య
అన్న నగు నన్ను మఱవక యందఱెలమిఁ
గలిసి కూర్చున్నవేళలఁ దలఁపరయ్య.

ధర్మ : (భీమార్జునులను కౌఁగిలించుకొనును)

భీము - అర్జు : (తలలు వంచుకొని విషాదముతో నుందురు)

## 3 - వ రంగము

(వ్యాసమహర్షి ప్రవేశించును)

భీము : అన్నా ! అదే వ్యాసమహర్షి వచ్చుచున్నారు.

అర్జు : (సంతోషముతో) ఆపత్కాలమున మహాత్ముల దర్శన మసామాన్య ఫలసాధనము.

ధర్మ : వేదవ్యాసమునీంద్రా! ఇదే నానమస్కారము. (పాదములపైఁబడి నమస్కరించును. భీమార్జునులు నమస్కరింతురు)

వ్యాస: విజయీభవ. అఖండ రాజ్యలక్ష్మీ సంపన్నోభవ. ధర్మనందనా! కుశలమా ?

ధర్మ : ఇదివఱకుఁ గాకపోయినను దేవరవారి యనుగ్రహమున నిప్పుడు కుశలినేగదా (పీఠము వైచును మహర్షి కూర్చుండును)

అర్జు : మునీంద్రా ! ఏమి కుశలము. అఖండ రాజ్యలక్ష్మీ సంపన్నుఁడవు కమ్మని తమరు దీవించుచున్నారు. అన్నగారో యరణ్యములకుఁ బయనమై యున్నారు.

వ్యాస: (నవ్వుచు) అరణ్యముల కేమిటికి ? దుర్యోధనుఁడు లేఁడు గదా పంపుటకు.

భీము : మౌనిచంద్రా ! ఆ దుర్యోధనుఁడు బ్రతికియుండగా మమ్మరణ్యములకుఁ ద్రోలినాఁడు. చచ్చియు మరల నిప్పుడు త్రోలుచున్నాఁడు.

వ్యాస: పార్థివోత్తమా ! నీ యభిప్రాయమేమి ?

ధర్మ : స్వామీ! నా యభిప్రాయ మేమున్నది ? తపఃప్రభావమున జగద్వ్యాపారములనెల్ల సాక్షాత్కరించిన మీకుఁ దెలియని దేమున్నది ?

తే. పోరవధియించినాఁడను బూజ్యతముల
బంధుజనులను నింక నాపాతకంబు
లడవిఁ దపమాచరింప కెట్లడఁగునయ్య
మహితగుణసాంద్ర యోవ్యాసమౌనిచంద్ర !

వ్యాస: క్షాత్త్రానుగుణముగా యుద్ధమొనరించిన నీకు దోషము లేదని నీ పట్టాభిషేక సమయమునసే చెప్పితిమి. మఱియు రాజ్యాశ్రమమునివైన నీకు నరణ్యాశ్రమములతోఁ బనియేమి? ఆశ్రమవాసులకును రాజేగదా రక్షకుఁడు. తాపసుల తపస్సునం దాఱవభాగము ధర్మతత్పరుఁడైన రాజునకుఁ జేరుచున్నది. మఱియు

ఉ. సంతతమే మహావిభుని సంస్మరణంబున జీవకోటి, దు
ర్దాంత భవాంబురాశి సుకరంబుగ దాఁటుదు రట్టిదేవు, దై
త్యాంతకు ముందుఁబెట్టికొని యాలముఁ జేసిన నీకు నెందు, ర
వ్వంతయుఁ బాపమంటదు యథార్థము సుమ్మిది ధర్మనందనా!

భీమ: అమృతనిష్యందము మీవాక్యములు.

వ్యాస: ధర్మపుత్రా! ముల్లోకముల నీభాగ్య మెవరికిని లేదుగదా.

ఉ. వేడుకమీఱ నిత్యమరవిందభవాదులు ప్రస్తుతించియున్
జూడగలేని విష్ణుఁడఁట చుట్టము, మంత్రియు, నింత యేల నీ
వాఁడఁటె యెట్టి పుణ్యపరిపాకమొ మేరుమహీధరంబు ని
ట్రాడుగ వేసికొంటివి, ధరావర యూరక చింత లేటికిన్.

ధర్మ: తాపసేంద్రా! మీవచించినదెంతయు సత్యము, ఐనను నా హృదయమేలకో కలుషితమై తేరకున్నది.

వ్యాస: భరతవంశోత్తమా! నీకుఁ బాపమే లేదు. ఉన్నదని యనుకొనిన నశ్వమేధయాగ మొనర్పుము. పూర్వరాజశేఖరులందఱు నీ మహాయజ్ఞమును జేసి సర్వకిల్బిషములఁ బాచికొనిరి.

అర్జు: ఈ మహారాజాసవనకరణమున కర్హుఁడు.

ధర్మ: పారాశర్యమునీంద్రా! అశ్వమేధయాగమున సర్వపాపములు నశించునా?

వ్యాస: నిస్సంశయముగా నశించును, కాని యది సామాన్యమానవేంద్రులు సేయ సాధ్యముగాదు. కోట్లకొలఁది ధనము వ్యయమగును నీవంటి సార్వభౌముఁడు దాని కర్హుఁడు.

ధర్మ : పూజ్యపాదులచే ననుగ్రహింపఁబడితిని కాని.

వ్యాస : ఏమట్లు మరల సంశయపడుచున్నావు ?

ధర్మ : ఏమియు లేదు స్వామీ! ఈ యుద్ధకారణమున భండారము లన్నియు వట్టిపోయినవి. సమృద్ధముగా ధనము లేక నేనెట్లు చేయఁగలుగుదునాయని సందేహించుచున్నాను.

వ్యాస : అందులకుఁ జింతింపనలదు. పూర్వము మరున్మహారాజు యజ్ఞాంతమున బ్రాహ్మణులకు నపారముగా బంగారము, ధనము నీయగా వారు మోయలేక హిమాలయమున నొక్కయెడ నాధనమునంతయుఁ బూడ్చిపెట్టి సత్కార్యములకు వినియోగించుటకు దీని నెవరుగైకొనిన వారిదేయని యనుశాసించిపోయిరి. అచ్చటికి మీరు తగుపరివారముతో వచ్చిన దాని మీకు నేను జూపింపఁగలను. నీయశ్వమేధమున కంతకును నది సరిపోవును.

భీము : ఇదియొక మహాప్రసాదము.

ధర్మ : మునిలోకచంద్రమా! మఱియొక సంశయము నన్ను బాధించుచున్నది.

వ్యాస : ఏమది ?

ధర్మ : అరణ్యవాసముచే నలఁగి ఘోరయుద్ధమున నలసటపడిన యనుజుల మరల నీ మహాక్రతుభారమున శ్రమింపఁజేయుట కుత్సహింపకున్నది నాచిత్తము.

భీము : అందులకు నీవు సంశయింపఁబనిలేదు. నీతమ్ములగ్నినుఱుకుమన్నను సంసిద్ధులే.

అర్జు : నీయనుమతి సేయుటకన్న మాకు వేఱుకర్తవ్యమేమున్నది.

వ్యాస : త్రిలోకవిజయధురంధరులైన తమ్ములు గలిగిన రాజర్షివి. నీయట్టివాఁడు సేయకున్న నింక నశ్వమేధ మొనర్చువారెవరు ? సందేహామువలదు. సన్నాహ మొనర్పుము, ధనమునకై మీరు

హిమాలయమునకు వచ్చినపుడు మరలఁ గనిపించెద. నీకఁ బోయివచ్చెద.

ధర్మ : మహాప్రసాదము (వ్యాసమహర్షి నిష్క్రమించును. ధర్మరాజు తమ్ములతోఁ గొంచెము దూరమనుగమించి నిలఁబడును)

ధర్మ : తమ్ములారా! నా మానసమున నిప్పటికిఁ గొంతబరువు తగ్గినట్లున్నది.

అర్జు : మహాత్ముల విషాదానందములు వ్యర్థములుగావు. ఏదేని నొక మహాకార్యమును జేయించుటకే యవి గలుగుచుండును.

ధర్మ : (ఆలకించి) అదే మధ్యాహ్నశంఖధ్వని వినిపించుచున్నది. ఇప్పటికి సభను విరమింతము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

# చిత్రాంగదా నాటకము

## ద్వితీయాంకము

### 1 - వ రంగము

స్థలము: అంతఃపురము. ధర్మరాజు పర్యంకముమీఁదను ద్రౌపది యొకపీఠముమీఁదను గూర్చుండి యుందురు.

ద్రౌప : భరతవంశోత్తమా! కొలఁది దినములనుండి యెప్పుడు నేదియో గాఢాలోచనములో నున్నట్లు కనిపించుచున్నారు. విశేషములేమైన నున్నవా యేమి?

ధర్మ : విశేషములు లేకపోవుటయేమి? యన్నియు విశేషములే.

ద్రౌప : ఐన నేను వినవచ్చునేని సెలవిండు కుతూహలమగుచున్నది.

ధర్మ : సాధ్వీ! నీవు వినరాని విశేషములుండునా మాకు?

ద్రౌప : ఆర్యపుత్రులకడ నట్టిచనవుండుటచేతనే గదా యడుగుచున్నాను.

ధర్మ : ద్రౌపదీ! యీమధ్య నొకరోజున నొక మహాఘట్టముజరిగినది.

ద్రౌప : (ఆశ్చర్యముతో) ఆర్యా! ఏమిటది?

ధర్మ : యుద్ధముముగిసిన నాఁటినుండియు, బంధు మరణశోకము, నాహృదయమును దహించుచునేయున్నది. రాత్రులందు నిద్దుర లేదు.

ద్రౌప : అవును మీ విషాదము తెలియవచ్చుచునే యున్నది. ఆహారముగూడ మీకు సరిగా రుచించుచున్నట్లు నాకుఁ దోఁచుట లేదు.

ధర్మ : నా రాజ్యాభిలాషమువలన నీ కురువంశమంతయు నూరక పొలిసిపోయినది.

ద్రౌప : కేవల కరుణాస్వభావులు గనుకఁ గౌరవులు తెగినందులకు మీరు విషాదపడుచున్నారు గాని, వారు దయనీయులు మాత్రము గారు. నాఁడు రజస్వలనైన నన్ను సభకీడ్చి తెచ్చి

యా దుష్టులొనర్చిన పని యే కాలమున నెవ్వరైనఁ జేసిరా! చేయుదురా! ఆ విషయమును దలంచుకొన్న నాశరీర మిప్పుడు కంపించుచున్నది. ఆశ్రితావన దీక్షితుఁడైన కమలాక్షుని కటాక్షమున, బ్రతికితిని గాని లేకున్న నాపని యేమి కావలయును ?

ఉ. పుట్టితి సోమకాన్వయము పూజ్యత నొందగ వేల్మియందుఁ, జే
పట్టితి మిమ్ము భర్తలుగఁ బౌరవవంశలలామభూతులన్
జుట్టపుదాననైతి మధుసూదను నంతటివాని, కట్టి నన్
బెట్టఁగరాని బాధలటు పెట్టిరి కౌరవు లెంతదుష్టులో.

ధర్మ : ప్రాణేశ్వరీ ! కౌరవులవలన మన కపకారము జరుగలేదని నే ననుటలేదు కాని యపకారికి మరల నపకారమొనర్చినవాఁడు మధ్యముఁడు. ఉపకారమొనరించినవాఁడేగదా యుత్తముఁడు.

ద్రౌప: నాథా! మీ యనన్య సామాన్యమైన శాంతిప్రభావ మట్టిది. తరువాత నేమి జరిగినది ?

ధర్మ : ఆవిషాద మావేళ నేలకో మహాప్రవాహమై కట్టలు తెంచుకొని వెల్లివిరిసినది.

ద్రౌప: (ససంభ్రమము) అనుజులెవ్వరును దగ్గఱలేరా ?

ధర్మ : లేకేమి భీమార్జునులున్నారు. వారేమి సేయుదురు.

ద్రౌప: అవును. దరువాత

ధర్మ : తరువాత నేమున్నది ఆ చింతాభరమును భరింపలేక బంధువధ పాతకమును బాపుకొనఁ దపమాచరించుటకై యరణ్యములకుఁ బోవఁ బ్రయాణమైతిని.

ద్రౌప: కానలకుఁ బ్రయాణమే ! (సంభ్రమ విషాదములతో) ఆ ప్రయాణ సంకల్ప మిప్పుడును లేదుగదా.

ధర్మ : భయపడకుము. లేదు, మాఱిపోయినది.

ద్రౌప: (నిశ్వసించి) బ్రతికితిమి. ఎట్లు మాఱినది.

ధర్మ : నా విషాదమువలన సభయంతయు నాకులపడిపోయిన దట్టి సమయమున.

ఉ. రాసులుగాఁదనర్చు శ్రుతిరాజి విభాగముచేసి వాక్య వి
న్యాసముఁ దీర్చినట్టి చతురానన సన్నిభమూర్తి, యేఁడు వా
రాసుల మధ్యనున్న ఋషిరాజులకెల్లను మేలుబంతి, యా
వ్యాసమునీంద్రుఁ డచ్చటికి వచ్చెను గోమలి! మమ్ముఁజూడఁగన్.

ద్రౌప: ఆ వ్యాసమహర్షి యప్రతిమ ప్రభావుఁడు నారాయణ స్వరూపుఁడు గదా.

ధర్మ : అట్టి వ్యాసమునీంద్రులువచ్చి "నీకుఁ బాపమే లేదనియు, నున్నదని సందేహమున్న నశ్వమేధయాగము చేయుమనియు నియోగించి వెళ్ళిరి.

ద్రౌప: అశ్వమేధయాగమా ?

ధర్మ : అవును.

ద్రౌప: అదియు రాజసూయమువంటి మహాయజ్ఞమేనా ?

ధర్మ : దానికంటెను గొప్పదనియే చెప్పవచ్చును.

ద్రౌప: అయిన దానివిధానమేమో చెప్పుడు కర్ణరసాయనముఁజేసెద.

ధర్మ : ఇంతీ ! ఆ విధానములన్నియు సాంగముగా వ్యాసమహర్షి చెప్పిరి. వినుము. ఈ మహాయజ్ఞమును జేయుటకు నారాయణ పాదభక్తులు, సదాచారసంపన్నులైన ఋత్విజు లిరువది వేల మంది కావలయును.

ద్రౌప : అబ్బా! యిరువదివేలే. అంత నుంది బ్రహ్మణ్యులొక్కచోఁ జేరి వేదఘోషమొనరించుచుఁ జేయు నా యజ్ఞమును జూచిన వారిదే జన్మము.

ధర్మ : ఆరంభమునఁ జైత్ర పూర్ణిమయందు నశ్వమును విడుచు నప్పు డాఋత్విజుల కందఱకును నొక్కొక్క మేలుజాతి గుఱ్ఱమును నొక మదపుటేనుఁగును, నొక రథమును, గనక

విభూషితములైన వేయిగోవులను నొక్క బారువు బంగారమును నీవలయును.

ద్రౌప : ఒక్కొక్కరి కిన్ని చొప్పున నిరువదివేలమందికి నీవలయునా! అబ్బా యెట్టి వైభవమండీ !

ధర్మ : ఆగుఱ్ఱము మొగమున, "రణశూరులున్న దీనిఁ బట్టుకొన వచ్చు"నని వ్రాసిన బంగారు పట్టమునుగట్టి, రాజులు పట్టు కొన్నపుడు వారినిజయించి విడిపించుటకై యజ్ఞకర్త కుమారుఁడుగాని, తమ్ముఁడుగాని వెంటఁబోవలయును.

ద్రౌప : ఇది మహాకష్టము, అట్లయిన గుఱ్ఱము వెంటవెళ్లు నతఁడు త్రిలోకవిజయధురంధరుఁడుగా నుండవలయును.

ధర్మ : అందువలననే యీ యజ్ఞము నందఱును జేయలేరు.

ద్రౌప : తరువాత.

ధర్మ : ఆ గుఱ్ఱము లోకమున స్వేచ్ఛగా నొక్క సంవత్సరకాలము పరిభ్రమించి మరలఁ జైత్రపూర్ణిమకు విడిచినచోటికి దానంత నదియేవచ్చును. తిరుగునపుడు హయము, మలమూత్రములు విడిచినచోటుల నెల్ల హోమముఁ జేయించుచు, రాజులెవ్వరైనఁ బట్టిన వారలజయించి యశ్వమును విడిపించునపు డాగమోక్త దక్షిణలఁ బాత్రభూతుల కొసంగవలయును. ఇచట కర్త తురంగము తిరిగివచ్చువఱకు భోగములన్నియు మాని నియ తుఁడై నిరతాన్నదాన మొనర్పవలయును.

ద్రౌప : ఆహా! ఎంత విషయము, నాథా! గుఱ్ఱము తనంతటనే సంవత్సరమునకు విడిచినచోటికి వచ్చునంటిరే యది యెట్లు ? పరిమితకాలమునకు ముందుఁగానీ వెనుకగానీ రాదా ? అసలు రాకుండఁబోయినఁ బోదా ?

ధర్మ : కలికీ! అట్లు వచ్చుటకుఁ బోవుట కది మామూలుగుఱ్ఱము గాదు. అశ్వమేధీయహయము వేఱు. దీనికి శరీరమంతయుఁ

దెలుపు తోఁక బంగారు రంగు, చెవులు నలుపు గలిగియుండ వలయును. అట్టిదే పనికివచ్చును.

ద్రౌప : ఇట్టి గుఱ్ఱములుండునా ?

ధర్మ : దొరకుటకష్టము, భద్రావతీపురమున యౌవనాశ్వమహీ వరునికడ నొకటి యున్నదఁట దానిఁ బది యక్షోహిణుల సేన కాఁపాడుచున్నదఁట

ద్రౌప : అట్లయిన నది యెట్లువచ్చును.

ధర్మ : ఊరక యెట్లువచ్చును. ససైన్యముగా యౌవనాశ్వుని జయిం చినఁగాని రాదు. అతనిని జయించి యశ్వమును దెచ్చుటకు మన భీమసేనుఁడు ప్రయాణమగుచున్నాఁడు. వెంటఁ గర్ణుని కుమారుఁడైన వృషకేతనుఁడును ఘటోత్కచుని కుమారుడైన మేఘవర్ణుఁడును వెళ్ళుచున్నారు.

ద్రౌప : రాజోత్తమా ! సకలరాజన్యులయందును నీ యుత్తమశ్లో కత్వమునకే జన్నము గీటురాయి గాఁగలదు.

ఉ. పావనమయ్యె నా చికురపాశము నీమహనీయ రాజసూ
యావసరంబునందు విమలాంబువులన్ మఱి దానిఁబట్టె దు
ర్భావుఁడు దుస్ససేనుఁడు కరంబున, నాకలుషంబు నశ్వమే
ధావబృథంబుచేత నిపుడార్చెదఁగాక నరేంద్రభూషణా !

అయిన నీక యజ్ఞము మొదలేనన్నమాట.

ధర్మ : మొదలుపెట్టినట్లే. కాని యజ్ఞకర్తయు యజ్ఞభోక్తయు, యజ్ఞ స్వరూపుఁడును, జగద్వందితుఁడునైన మందరధరుని యనుమతిఁ గైకొనుట యొక్కటియే తడవు. ఆ మహాపురుషుఁడు ద్వారకా నగరంబునకరిగి యెక్కువకాలము కాకపోయినను, నెన్నియుగ ములో గడచినట్లున్నది. తగువారిఁ బనిచి యిప్పుడప్పుండరీ కాక్షుని రావింపవలయును.

ద్రౌప : ఆశ్రితావనపరాయణుండైన యా నారాయణుండు భక్తులు తలంచిన మాత్రముననే ప్రత్యక్షమగుచు.

ధర్మ : ఆ దేవాది దేవుని కృపలేక యేదియును జేయలేముగదా.

(ప్రతిహారి ప్రవేశించును)

ప్రతి : జయము. మహారాజునకు జయమగుఁగాక.

ధర్మ : వేత్రవతి! యేమి విశేషములు ?

ప్రతి : ప్రభూ! దేవరవారి యాస్థానగమనమునకై సారథి యింద్ర సేనుఁడు రథము నాయత్తముఁ జేసికొని వాకిటనిలిచియున్నాఁడు.

ధర్మ : దేవీ! ద్రౌపదీ! నీతో సంభాషించుచుఁ గాలమును సైతము గుర్తింపనైతిని. ఆస్థానమున నాకొఱ కెదురుచూచుచుందురు. పోయివచ్చెద భద్రముగా నుండుము. (ప్రతిహారితో నిష్క్రమించును.) (ద్రౌపది కొంచెమనుగమించి నిలుచును.)

ద్రౌప: (ఆత్మగతము) శ్రీకృష్ణస్వామివారి రాకకై యెదురు చూచు చున్నారు పాండవులు. ఆ స్వామిభక్త పరాధీనుఁడు. సర్వ జ్ఞుఁడు, కాక నీతలంచినయపుడెల్లఁ బ్రత్యక్షమయ్యెదనని నాకు వరమిచ్చియున్నాఁడు. కావున నిప్పు డాసర్వేశ్వరుని ధ్యానించెదఁగాక.

(కన్నులు మూసికొని పాడును)

పాట

కల్యాణిరాగము – ఆదితాళము

ప. మందరధారీ – మంజు విహారీ !

అను. బృందా కుంజవనీ సంచారీ. ॥మంద॥

చ. సుందరరూపా – సుగుణకలాపా
మందమధుర మకరందాలాపా ॥మంద॥

2. నీపదభక్తుల – కాపదలేదు
పాపవిదూరా – ప్రణవాధారా ॥మంద॥

3. వేడుకనైనను – విశ్వాసయుని నిను
బాడినహాయి – ఫణిఫణశాయీ ! ॥మంద॥

చేటిక చతురవాణిని దేవగృహమలంకరింపుమని చెప్పితిని. ఎట్లలంకరించినదో పోయి చూచెదఁగాక.

(నిష్క్రమించును) తెరపడును.

## 2 వ రంగము

(స్థలము - ఆస్థానమంటపము, ధర్మరాజు భీమార్జునులతోఁ గొలువుండును)

ధర్మ : తండ్రీ! ఫల్గునా! వసుదేవసూనుఁడు ద్వారకకరిగి బహు కాలము కాకపోయినను నామహాపురుషుని దర్శనమునకు నామనస్సు తహతహపడుచున్నది.

అర్జు : ఆనందములకు నెలవైన యీ సర్వేశ్వరుని దర్శనము చాలునని తృప్తిపడువారెవరు ?

భీము : అన్నా ధర్మనందనా! ఇప్పు డాయదుభూషణుని రావింప వలయునుగదా.

ధర్మ : రావింపక మనమేమిఁ చేయఁగలము. గోపాలదేవుఁడు లేని పాండవులు ప్రాణంబులులేని శరీరములని లోకప్రసిద్ధము.

భీము : అయిన నిప్పుడాస్వామి నవశ్యము దీసికొని రావలయునని దూతను బంపవలెను.

ధర్మ : ఆశార్ఙ్గధరుని సన్నిధికి సామాన్యదూతను బంచుట నాకంత భావ్యముగాఁ గనిపించుటలేదు.

అర్జు : అన్నగారిమాట తథ్యము. గౌరవార్హులఁ బిలుచుటకు దూతలు పనికిరారు.

ధర్మ : పార్థా! మఱియొకరుగాదు, నీవే ద్వారకకేగి దేవకీనందనునితో నా యశ్వమేధారంభమును సూచించి తగుమాటలాడి యీ దేవాదిదేవుని వెంటబెట్టుకొని రమ్ము. వ్యాసప్రేరితుఁడనగు నాకా కృష్ణసందర్శనమగువఱకు నేమియుఁ దోఁపకున్నది.

అర్జు : చిత్తమట్లే పోయివచ్చెద.

(దౌవారికుఁడు చారువేత్రుఁడు ప్రవేశించును)

చారు : మహాప్రభువులకు జయమగుఁగాక (మోకరిలఁబడును)

ధర్మ : (చూచి) చారువేత్రా! యేమిపనిమీఁద వచ్చితివి ?

చారు : ప్రభూ! శ్రీకృష్ణస్వామివారు వచ్చి వాకిట నిలిచియున్నారు. లోనఁ బ్రవేశించుటకుఁ దమయనుమతి నపేక్షించుచున్నారు.

ధర్మ : (సాశ్చర్యము) శ్రీకృష్ణస్వామివారా! ఏమీ నా భాగ్యపరిపాకము! (తమ్ములవంకఁ జూచును)

భీము : విశ్వవ్యాపకుఁడైన యాభగవానుఁడు తలఁచినచోటనే ప్రత్యక్షమగును.

అర్జు : ఆ శ్రీకృష్ణదేవుని యాశ్రితవాత్సల్యమట్టిది.

ధర్మ : చారువేత్రా! ఆ జగత్ప్రభునిఁగూడ వాకిటనే నిలవఁబెట్టితివా ?

చారు : మహారాజా! నేను నిలువఁబెట్టలేదు అవసరములేదని నేనెంత వేఁడినను మీయనుమతిఁ గొనిరమ్మని యాస్వామి నన్ను బంపినారు.

ధర్మ : చారువేత్రా! వెంటనే ప్రవేశపెట్టుము. (తమ్ములవంకఁజూచి) ఆ సర్వలోకాభిగమ్యు నెదుర్కొనవలయునుగదా. (దౌవారికుఁడు నిష్క్రమించును. ధర్మజ భీమార్జునులు ముందునకు నడతురు.)

## 3 - వ రంగము

(శ్రీకృష్ణస్వామి ప్రవేశించును)

శ్రీకృ : (ధర్మరాజునకు నమస్కరించును. భీమార్జునులు వరుసగాఁ గౌఁగిలించి నమస్కరింపగాఁ గౌఁగిలించుకొనును) భరతాన్వయముఁ బవిత్రీకరించిన సార్వభౌమా! ధర్మనందనా! తమ్ములకును నీకును గుశలమేగదా ?

ధర్మ : దేవర వారిట్లు తలంచినమాత్రనే ప్రత్యక్షమగుచుండగా మాకుశలమునకుఁ గొఱంత యేముండును స్వామీ! ఈ యాసనము నలంకరింపుడు

శ్రీకృ : సోదర సహితుఁడవైన చక్రవర్తివి నీవు కూర్చుండకయేనా నేనాసనమలంకరించుట (కూర్చుండును ధర్మరాజాదులు కూర్చుండుదురు)

ధర్మ : అదనునఁగురియు నమృతవర్షమువంటి నీయాకస్మికదర్శనమున ధన్యులమైతిమి.

ఉ. ఎచ్చటినుండి రాక కమలేక్షణ! మావసుదేవదేవకుల్
పొచ్చెము లేనివారె? సుఖపూర్ణుఁడె రాముఁడు? శౌర్యసారసం
పచ్చతురుల్ కుమారులకు భద్రమె? భార్యలు సేమమేగదా
హెచ్చులు తగ్గులున్ బాదలవేకదయెయ్యవి బంధుకోటిలోన్.

శ్రీకృ : ధర్మపుత్రా! నీయడిగినవారెల్లరు క్షేమమే. ఏమిమందుఁ బెట్టితిరోగదా మీపాండుపుత్రులు? ద్వారకలోఁ గాలునిలుచుట లేదు. మిమ్ముఁ జూచినదనుక నాకుఁ దోఁచుటలేదు.

ధర్మ : ప్రభూ! మందుఁబెట్టినమాట నిజమే. యామందును వ్యాసనారద పరాశరాది మహర్షులెఱుఁగుదురు. ఆ మహాత్ములవలననే మాకును నామందుసంగతి కొంచెము తెలియవచ్చినది.

అర్జు : దేవా! నిన్నేమందులచేత వశపఱచుకొనవచ్చును?

ఉ. మందులు మ్రాఁకులున్ వెడగు మాయలు నీకడ నేమిసేయునో
నందకుమార! నీవిమలనామములెన్నుచు భక్తియుక్తులై
వందనమాచరింపఁగలవారికి ముంగిటి పారిజాతమై
యుందువుగాని వేఱొకటి యున్నదె నిన్ను రమింపఁజేయఁగన్.

భీము : విభూ! దేవకీనందనా! నిన్నారాధించువారి కేకొఱఁతలుండవు గదా. శ్రితజనరక్షాదీక్షితుఁడవైన నిన్నాశ్రయింపఁగన్న వారిదే భాగ్యము.

ఆడఁజనుతీర్థ మెదురైనయట్లు వెదకఁ
దగిన తీవమె కాలికిఁదగిలినట్లు
నీదురాకయె వాంఛించి నెమకుచుండ
నరుగుదెంచితివయ్య దేవాదిదేవ !

తలఁచినచోటనే కన్నుల కటవుదీఱగా వెలయు నీభక్త వాత్సల్య మెంతనవచ్చును.

శ్రీకృ : బావా ! భీమసేనా ! మీరు నాకొఱకిప్పు డెదురుచూచు చుంటిరా ?

అర్జు : అవును స్వామీ ! యీ ధర్మనందనుఁడు వ్యాసనియోగమున నిప్పు డశ్వమేధయాగ మొనర్ప నుద్యుక్తుఁడై యున్నాఁడు. నీయనుమతిలేని దీపాండుసూను లొక్కయడుగు వేయను సమర్థులు కారుగదా, అందులకై నీకొఱకు నన్నీమహారాజు ద్వారకకుఁ బంపుచున్నాఁడు. ఇంతలో దేవరవారే విచ్చేసితిరి.

శ్రీకృ : శుభము – వినవలసిన వాక్యమును వింటిని. ధర్మనందనా ! నీవంటి పుణ్యశ్లోకుఁడు త్రిభువన విజయధురంధర వీరానుజుండు గాక మఱియొకఁ డశ్వమేధము నొనర్పశక్తుఁడగునా ! జగద్గీయమాన యశోధూర్వహుండవగు నీకాజన్నము మఱింత కీర్తి పటహంబు కాఁగలదు. అవశ్యము ప్రారంభింపుము.

ధర్మ : దేవా ! మేము నిమిత్తమాత్రులము. సర్వనిర్వాహకుఁడవైన నీయనుమతియైనఁ బడపఁ గదా మే మారంభింపవలసినది.

శ్రీకృ : భరతకులప్రదీపా ! నీవు ముందుగా నాయనుమతిఁ గైకొనవలయునా ? యీ సేవకునకు నీవేపని నియోగించిన మాటాడఁ గలఁడు. పాండవు లగ్ని నుఱుకుమన్నను సముద్రమధ్యమునఁ బడుమన్నను నీ దేవకికొడుకు సంసిద్ధుఁడన్న విషయము జగద్విదితమై యున్నది. సార్వభౌమా !

చ. ప్రభుఁడవు మాకునెల్ల నిరపాయనయస్థితి నాది రాజస
న్నిభుఁడవు, సత్యశీల మహనీయచరిత్ర విహారి, వట్టి, నీ
శుభమగునాజ్ఞకై యెదురుచూచుచునుండిన కింకరుండ నో
యిభపురనాథ పెంచి వచియింపఁగ నేటికి వేయిమాటలన్.

ధర్మనందనా ! మఱొక్కమాట సెప్పెద నాలింపుము.

ఉ. పూర్వతపోవిశేషమునఁ బొందినదియ్యదె నాదుమేను, పా
టోర్వని యాయుధంబులివె యుజ్జ్వలప్రాణము లియ్యవే కళా
ధూర్వహులైన పుత్రులును దొయ్యలి పిండు పదాఱువేవురున్
సర్వము నీయధీనమిఁకఁ జంద్రకులాభరణా ! గ్రహింపుమా.

ధర్మ : దేవా ! యిట్టి నీయనుగ్రహమునఁగదా యీ కౌంతేయులు వచ్చిన యాపత్సముద్రములనెల్ల నుత్తరించి మనుష్యులై మహిమీఁద మనఁగలుగుట.

శ్రీకృ : పార్థివేంద్రా ! యాగహయము నెచ్చో సంపాదించితిరి.

ధర్మ : లక్షణవంతమైన గుఱ్ఱము, భద్రావతీపురాధిపుఁడైన యావనాశ్వునికడ నున్నదఁట.

అర్జు : యావనాశ్వుని జయించి గుఱ్ఱమును దెచ్చుటకుఁ జిన్నన్నగారు ప్రతిజ్ఞఁగావించిరి.

శ్రీకృ : (నవ్వి) యువరాజు భీమసేనమహారాజుగారా ? అవును ధర్మయుద్ధమున దుర్యోధనుని జయింపలేక యన్యాయంబుగాఁ దొడలు విఱుగనేసి కూల్చిన మహాశూరుఁ డితఁడు. బావా ! భీమసేనా ! నీయట్టి లోకైకవీరుఁ డిట్టిప్రతిజ్ఞఁబూనవచ్చును.

భీము : దేవా ! యదుకులోత్తంసా ? లోకాధిపుఁడవైన నీవిట్లు పరిహాసమునకు దిగితివి. నీయభిలాషము నేల చెఱుపవలయును. కానిమ్ము. దుర్యోధనునితొడలు విఱుగవేయుట యొక్కటేగా దిట్టి వింకను మేముచేసినవి. నీవు దగ్గఱనుండి చేయించినవి. పెక్కుగలవు. వానిఁగూడఁ జెప్పి పరిహసింపుము. వదలనేల ?

శ్రీకృ : (పెద్దగా నవ్వి) వృకోదరా! వదలిపెట్టితినని యనుకొంటివా లేదు. వినుము.

సీ. తేరుధారుణిఁగ్రుంగి ధృతిసెడ్డ కర్ణుని
విప్వచ్చుచేతఁ గూల్పించినారు
కడ సంజమాయాంధకారంబు మాటున
సైంధవనిధనంబు జరిపినారు
శినివరుపోరిలోఁజిక్కి యేమఱియున్న
భూరిశ్రవునిఁ జంపిపుచ్చినారు
సరిదాత్మజుని యేపు సైరింపలేక శి
ఖండి చాటునఁజేరి కలఁచినారు

లోకమునఁ జూచువారికి మేఁకపోతు
దంభమేగాని నెమ్మదిఁ దఱచిచూడ
లోననున్నట్టిదంతయు లొట్టగాదె
మీచరిత్రంబు లెఱుఁగనే మేనబావ!

భీము : అవును నిశ్చయమే. మా చరిత్రములు నీవెఱింగినవే. అందులకు నేను కాదనను

తే. కాని యీకుంతికొడుకులు కడఁగి సేయు
మంచిసెడ్డలకెల్లను నెంచిచూడ
మూలభూతుండ వీవని ముజ్జగంబు
లెఱిఁగియున్నవి పరిహాసమేల స్వామి!

శ్రీకృ : మఱున్నందనా! నవ్వులాటలకంటెనిగాని మీ ధర్మచారిత్రంబును నీ బలపరాక్రమము లెఱుంగనా. ప్రచండ గదాదండ మండితహస్తుండవై భండనాంగణమున నిలిచిన నిన్నెదుర్కొనువారెవరు ?

సీ. రాజరక్తమున భైరవపూజఁగావించు
మగధనాయకు పేరు మాపినావు
ఘన మదోద్ధతుహిడింబునిఁజంపి వనమెల్ల
విగతకంటకముఁ గావించినావు
లోకముల్ వినుతింప నేకచక్రాపుర
వాసుల వెతఁ దీర్చివైచినావు
విత్తాధిపుని రాచవీటినల్లాడించి
తెలివకై పుష్పంబుఁ దెచ్చినావు
ఘన కురుక్షేత్ర కదనరంగంబునందుఁ
బగరుపరికింప యువరాజుఁ బట్టి రొమ్ము
చీల్చి రక్తంబుఁ ద్రావిన జెట్టివీవు
పరులు నీతోడ సాటియే పవనతనయ !

ధర్మ : ప్రభూ పాండుసూను లేకార్యమొనరించినను దేవర యనుగ్రహమేకదా కారణము ధనముఁ గొనివచ్చుటకై హిమాలయమునకురమ్మని వ్యాసమహర్షి యాదేశించివెళ్ళిరి. తమ యనుమతియైనచోఁ బ్రయాణ సన్నాహముఁ గావించెద.

శ్రీకృ : అవశ్యము గావింపుము. సర్వసవనసంభారములతో ఋత్విగ్గణసహితుండవై యశ్వమేధయజనదీక్షితుఁడవైన నిన్నుచిరకాలంబునఁ జూతుముగాక.

(అందఱు నిష్క్రమింతురు)

( తెర పడును )

ఇది ద్వితీయాంకము.

# చిత్రాంగదా నాటకము

## తృతీయాంకము

### విష్కంభము

(శాండిల్యుఁడు ప్రవేశించును)

శాండి : (తనలో) ఈ క్షత్రియులకు చావంటే లెక్కలేదు. చంపట మంటే తృణప్రాయము. నాకేమో అవిరెండూ అంటే మహా చెడ్డభయము. భీముడు యౌవనాశ్వునిజయించి సవనాశ్వమును దెచ్చాడు. యాగహయరక్షణానికి అర్జునుడు సపరివారముగా బయలు దేఱుతున్నాఁడు. గుఱ్ఱమునకు కలితుకార్యాలు దీర్చ టానికి వెంట యాజ్ఞవల్క్య శిష్యుఁడైన యాగవ్రతుడు వెళ్లు తున్నాడు. అంతవఱకూ సరే. వాళ్ళయుద్ధఱకూ సహాయము నేనట. ఏమిచేసిచచ్చేటట్టు. ఆ యుద్ధములంటేనే నాకు భయ మయ్యా మహారాజా! అంటే కాదుకూడదు. పొమ్మన్నాడు ప్రభువు అర్జునుడుగూడ పైగా నన్నేరమ్మన్నాడు. చేసే దేముంది. చావోబ్రతుకో పోవలసిందే. రాజు తలచుకొంటే దెబ్బలకుకొదవా? (పైకిఁజూచి) చాలప్రొద్దెక్కినదే. ఈపాటికి గుఱ్ఱము బయలువెడలిందేమో (త్వరత్వరగా నడచును)

(లంబోదర శాస్త్రి ప్రవేశించును)

లంబో : శాండిల్యా! నిలుచో నిలుచో.

శాండి : ఎవరువారు? (వెనుకకుఁదిరిగి) నీవా శాస్త్రిగారూ! నిలు చుండటానికి నాకిప్పుడు తీఱుబడిలేదు త్వరగా పోవలె.

లంబో : ఓరి నీయమ్మకడుపు బంగారంగానూ, నేనూ అటే వస్తు న్నానులేవయ్యా! కాస్త పొడుంవెయ్యి.

శాండి : నీవసలే లంబోదరశాస్త్రివి. పైగా నసవేసుకొంటే వదలవు. నీతోబెట్టుకొంటే నాకివ్వేళ చీవాట్లు చెప్పుదెబ్బలు తప్పవు.

ఈ వేళ ధర్మరాజు యాగహయాన్ని వదలుతున్నాడు. అర్జునుని వెంట నన్ను గూడ బొమ్మన్నాడు. అందుకు పోతున్నాను.

లంబో : తస్సాజిక్క. యీ వేళ నాది నస అయ్యింది. రోజూవచ్చి పొమ్మన్నా పోకుండా యిళ్ళవెంట ఆలోచన వేసుకొనేవాడివి; నేనూ అటే వస్తున్నాను. నిన్ను నిలబడమన లేదుగా.

శాండి : సరే రావయ్యా బాబూ.

లంబో : అయితే మొన్న ప్రభువుగారు, అన్నిరథాలమీద, గుఱ్ఱాల మీద, ఏనుగులమీద వేసుకునచ్చారే. ఆ్రోళ్లు బంగారమే. రోకళ్ళూ బంగారమే. పాత్రలూ బంగారమే. గరిటెలు తెడ్లు అన్నీ బంగారమే. చూచేసరికి కళ్ళు తిరిగిపోయినయి. ఆబంగారమంతా యెక్కడిదయ్యా? ఆహిమాలయంమీద ఏమైనా గనివున్నదా ఏమిటి ?

శాండి : గనీ లేదు గట్టా లేదు. నీకాసంగతి తెలియ లేదుగాబోలు. పూర్వము మరుత్మహారాజు యజ్ఞాంతమున దానమియ్యగా బ్రాహ్మణులెత్తుకొని పోగలిగినంతవఱకు కొనిపోయి మిగిలిన దాన్ని ఆ హిమాలయంమీద ఒకచోట పాతిపెట్టి దీన్ని ఎవరు తీసికొంటే వారిదేయని వదలిపోయారట, అదీ ఆ బంగారము.

లంబో : (సాశ్చర్యము) ఊఁ ఏమిటీ మరుత్మహారాజు దానమిచ్చాడా ఆ బంగారమంతా!

శాండి: అవును వ్యాసమహర్షి చెప్పిచూపగా యాగముకొఱకు ధర్మరాజు దాన్ని తెచ్చాడు.

లంబో: ఓరి నీబూటకము తగలబెట్టా, పెద్ద బుట్టల్లివేసేవే.

శాండి: బూటకమేమిటయ్యా! శాస్త్రిగారూ.

లంబో: బూటకంగాక నిజమా ? అంతబంగారం దానమిచ్చాడంటే, ఎవరైనా నమ్మేమాటేనా యిది.

శాండి: ఎందుకని నమ్మరు ?

లంబో: ఎక్కడన్నా పెళ్ళిళ్ళకూ పేరంటాలకు యజ్ఞాలకూ వెళ్ళితే, అక్కడ సంభావన తలకొక పావలా, లేక ఘనంగా యిస్తే ఒకరూపాయి యిచ్చేవఱకు గగనము, మనవాళ్ళక్కడఉండి, దానమిస్తే మంచిదని యేమేమో ఉపన్యాసాలిస్తే, వాటి నాయజమాని సమ్మేవాడయితే అదీను, లేకపోతే ఒకొక్కచోటికి బోతే చీవాట్లతో తిరిగిరావలసిందే. అట్లాంటిది ఆరాజొక్కడే ఆ బంగారమంతా యిచ్చాడంటే అర్థంవుండవద్దు? అసలు పావలా బేడయినా యిచ్చేవాళ్ళంటే వాళ్ళరు నిజంగా మహానుభావులనే చెప్పవచ్చు ఊరకే యితరుల కియ్యటానికి ప్రాణమెవరికి ఒప్పుతుంది

శాండి: ఇతరుల కియ్యటానికి మనస్సొప్పేవారు లేరంటావా?

లంబో: నీవట్లాగే చెపుతావు. నీకేం పెళ్లామా బిడ్డలా? ఆ రాజాస్థానంలోబడి తింటూవుంటే నీకేం తెలుస్తుంది. డబ్బు సంపాదించటంలో నేమి బాధవున్నదో నాబోటివాడికి తెలుసు. అలాంటి డబ్బు నితరుల కూరకే ఇయ్యటమంటే సామాన్యమా యింట్లో పెళ్లాము బిడ్డలకు ఖర్చుపెట్టాలంటేనే మనస్సొప్పదు. తన పొట్టకు తినాలంటేనే కష్టంగా ఉంటుంది. మొన్నొకాయన గృహప్రవేశముచేస్తూవుంటే వెళ్ళితే సంభావన, అణా ఇచ్చేవఱకు బ్రహ్మాండమైంది. పైగా ఆయన లక్షాధికారి. వెనక తింటానికి పిల్లాజెల్లాలేరు. మఱిమఱి అడిగితె పైకివచ్చాడు.

శాండి: నీవుచెప్పే దేవడో ఒక పరమలోభిసంగతి.

లంబో: అంతా అంతే. ఊరకెవరు పోసుకొన్నారు గుట్టలు ఇయ్యటానికి! నామట్టుకు నేను ఇతరులకిస్తే మంచిదని చెప్పటమే తప్ప, నాచేతితో ఒక కానీ యీయలేను, ఇంట్లోగూడ ఖర్చుపెటితో వూరుకోను, కూరగాయలుకూడ కొనసేయను, సంభావనలకు దక్షిణలకూ వచ్చినడబ్బు మూటగట్టి దాచిపెడుతూవుంటా, వాటిని మళ్లీ అంటుకొంటే అశుద్ధమంటుకొన్నట్లే

యని ఒట్టువేసుకొంటా, రోగంవచ్చేది రొంపివచ్చేది. ఇంట్లోవాళ్లు చచ్చేది మిడిసేది, దాన్నిమాత్రము కదపను. కదిపితే యెన్నాళ్లు వస్తాయి?

శాండి : ఓరి నీ త్రాడుదెగ, బలేవాడివేనే. ఇంతవాడవన్న సంగతి యిది వఱకెఱగనే. మఱి కూరగాయలు కొననీయనంటివే. అన్నము దేనితోతింటావు రోజూ.

లంబో : దేనితో తింటావూ! ఒక్కసారే పట్టిస్తా చింతకాయ పచ్చడి సంవత్సరానికి సరిపోయేటట్టు, దానికి తోడు గోంగూర పచ్చడి నొకదాన్ని కూడా పట్టిస్తా. తేలికగా పని అయిపోతుంది. సంవత్సరం వెళ్లిపోతుంది. పిల్లాజెల్లా యేడ్చినా యెత్తి మన్నయినా, వాటితో తినవలసిందే చచ్చినట్టు.

శాండి : నీవుమాత్రం ప్రతిరోజూ పచ్చడితో ఎట్లాతింటావయ్యా?

లంబో : ఎందుకయ్యా పిచ్చికూరలు, పచ్చడి చాలదూ. ఒకతవ్వెడు బియ్యం మెతుకులు పోవటానికి.

కం. అంగయిన పప్పు వడియాల్
పొంగళ్లును బాయసములు పులియోగిరముల్
బంగాళదుంపకూరలు
గోంగూరకుఁ జాలవన్న గువ్వల చెన్నా.

గోంగూరొకటి చాలదటయ్యా, ఎందుకు దుబారా ఖర్చు. దుబారాచేసి తినేవాళ్లనుజూస్తే నాకు మంట.

శాండి : ఓహో లంబోదరశాస్త్రీ! నీతత్త్వమంతా బోధపడింది. ఇక చెప్ప వద్దులే. నిరుపేదవాడు దానాలు చేసుకోవాలన్నా భోగాల్ని అనుభవించాలని అన్నా వీలుపడదుగదా. ఉండీ దానభోగములు లేసి నీవంటివాణ్ణి పరమలోభి అంటారు. లోభి యేధర్మ కార్యమూ చేయడు ఇతరులు చేస్తూవుంటే సహించడు. ఎట్టి మహాత్ములు యాచించినా తిరస్కరిస్తాడు. దానధర్మములు చేయకపోతేపోనీ కొండలు పరమమూర్ఖులు, పెళ్లాము బిడ్డలను

తాను తినుటకే ఓర్వనివాఁ
గూడ తిననీయరు, తాము తినరు, బంధువు లింటికివస్తే మొగము
డితరుల కేమిస్తాడు? బంధువు లింటికివస్తే మొగము
చిట్లించును. లోభికి దైవములేడు గురుడులేడు. అతని దృష్టిలో
డబ్బుగలవాడే దైవము. ఏ నీచకృత్యమైనా ఆచరించి కానీ
సంపాదించటమే యతనికి పరమార్థము. గౌరవప్రతిష్ఠ లట్టి
వానికి కడుదూరము, సుఖమెట్టిదో వానికి దెలియదు. ధనము
నకు ఫలము. దానభోగములని యెఱుగని యిట్టి వ్యర్థులెందఱో
నిరర్థకముగా జీవించుచుందురు. ఇట్టి మొండి యెప్పుడు చచ్చు
నాయని, ఇంటిలోనివారు కనిపెట్టుకొని ఉంటారు. లోభికి
బ్రతికి ఉండగా ధనమువలన ప్రయోజనము లేదు. చచ్చిన
తరువాత అసలే లేదు. దానధర్మాలు లేకుండా యిట్లా కూడ
బెట్టినవాళ్ళకసలు సంతానమే ఉండదు. ఒకవేళవున్నా, ఆ
సంతానము వ్యర్థులై యుంటారు. చివర కాధనమంతా ఎవరి
పాలో అవుతుంది. అట్టా దాచిదాచి పరులపాలు చేసిపోయే
వాళ్ల నెందఱినో చూస్తున్నాము.

లంబో: అయితే దుర్వ్యయము చేయటమే మంచిదంటావు.

శాండి: దుర్వ్యయము చేయుమని నేనూ చెప్పటంలేదు. తనకున్నంతలో
కుటుంబముతో కలిసి సుఖమనుభవించకుండా ఉంటే ధన
మున్నందుకు బ్రయోజనమేమిటి?

లంబో: సరే భోగాలనుభవించటం ఒప్పుకోవచ్చు, దానధర్మముల
వలన నేం ప్రయోజనం.

శాండి: అది లోకోత్తర విషయము. కీర్తికాముడైనవాడాపనులను
జేస్తాడు. దానంవలన పరలోకసుఖము, రెండవజన్మలో భోగ
సంపన్నుడు అవటం మొదలగునవి ఫలములు. అది అట్లా
ఉండనీ, మనుష్యుఁడైనవాడు తనచేతనైనంతవఱకు బాధపడే
తోడివానికి సహాకరించటం, ఉత్తమలక్షణముగదా. ఆమాత్ర
మార్ద్రభావములేనివాడు మనుష్యుఁడేగాడు. కావుననే,

ఉ. యాచకుఁడైనవాఁడు హృదయాభిమతంబును దీర్పుమంచుఁ, జే
చాచినఁజూచి ధిక్కృతిన సహ్యములాడి యనాదరించు, నా
నీచుని మోయఁజాలనని నెవ్వగఁ జెందును భూమిదేవి, వృ
క్షాచలవార్ధి భారముల కాత్మఁగలంగదు సుమ్మొకప్పుడున్.

అన్నారు పెద్దలు. లోకములో దాతలు, లుబ్ధులు, శూరులు, భీరువులు, శిష్టులు, దుష్టులు ఇట్లా అనేక రకాలవాళ్లుంటారు. లేరనుకోవడం అవివేకం, దాతల విషయం లోభికి విస్మయంగా ఉంటుంది. దాతకు లోభుల విషయమూ అంతే.

లంబో: పరులకు పంచిపెడితే మంచిదంటావు నీవు. అంతేనా

శాండి: నేను మంచిదన్నమాత్రాన నీబోటిలోభి త్యాగాన్నవలంబింపడు. వద్దని చెపితే మరుత్తునివంటి ఉదారుఁడు ఈకుండా వుండడు. మనకీ యనవసర ప్రసంగమెందుకు, అర్జునుఁడీపాటికి బయలుదేఱివుండును. నేను త్వరగా పోవలెను.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

## 1 - వ రంగము

(స్థలము సింధుదేశప్రాంతము)

(అర్జునుఁడు ప్రవేశించును)

అర్జు : సీ. జన్నంపు నెపమున జగతీశ్వరులవోర్చి
ఘనకీర్తిఁగొనుట నీకరుణఁగాదె
నాకాధిపునిఁబోకార్చి ఖాండవ
దాహంబుసేత నీదయనుగాదె
కర్ణభీష్మద్రోణ కదనాంబునిధిదాఁటి
యిలమెల్లఁగొనుట నీ బలిమిఁగాదె
బాణాగ్నిదగ్ధమా పాండవాన్వయరేఖ
మొలకరించుట నీదు చలువఁగాదె

గొంతిసంతతికిని బట్టుఁగొమ్మవీవె
యశ్వమేధీయ హయముఁ గాఁపాడుకొనుచు
నేగుచను నెట్లు ప్రోతువో యింకమీఁఁద
భక్తరక్షా స్వభావ! గోపాలదేవ.

ఈ హయరక్షణమున కుపక్రమించిన నాఁటినుండి ఇంచుమించుగా నాలుగు మాసములు కడచన్నవి. ఇంక నాలుగునెలలు పరిభ్రమింప వలయును, భారతయుద్ధమున సకల క్షత్రియులు పొలిసిరి. అయినను గుఱ్ఱము నటనట రాజులు పట్టుచునేయున్నారు. కాని నేను తెగించి యుద్ధముఁజేయుటకు వీలుగాకున్నది. ఎందులకనినఁ బట్టినరాజుల నదలించి బెదరించి గుఱ్ఱమును విడిపింపుముగాని వారిని నఱకవలదని మహాప్రభువు ధర్మజు నాజ్ఞయైయున్నది. తదాజ్ఞాపాలనము నాకు ముఖ్యకర్తవ్యము గదా (ముందునకుఁజూచి) శాండిల్యుఁ డెక్కడికో పోయి వచ్చుచున్నాఁడు.

(శాండిల్యుఁడు ప్రవేశించును)

శాండి: బలే! వహ్వా! అర్జునా! నీవంటి లోకైకవీరుడు మఱొకడు లేడయ్యా.

అర్జు: నావీరత్వము నీకిప్పుడేమి గనిపించినది?

శాండి: తేటతెల్లంగా కనిపించింది.

అర్జు. అవును నావంటి వీరుఁడు లేఁడనుకొనుము. నీవంటి భీరువును లేఁడుగదా.

శాండి: కాదు కాదు. ఇదివఱకు మీబోటివాళ్లంతా నన్ను పిఱికిపంద అనే అనేవాళ్లు నేనూ అట్లాగే అనుకొన్నా. కాని నాధీరత్వ మీవేళ బయటపడింది. నేను ఇప్పుడు ధీరులలో అగ్రేసరుడ ననియే చెప్పవచ్చు. ధీరాగ్రసరుడని నాకాలికి గండపెండారము కూడ వేయవచ్చు. ఏదీ నీకాలిగండపెండారము నాకాలికి వేసుకొంటాను.

అర్జు : ఆగుము. నేను ధరించినది నీవు వేసికొనుట మంచిదిగాదు. ఇంటికి వెళ్ళినపిదపఁ గ్రొత్తది వేయింతము. కాని నీవిప్పు డెచ్చటినుండి వచ్చుచున్నావు?

శాండి: ఈ సింధురాజధానిలోనికి పోయివస్తున్నా, రాచవీడంతా గగ్గోలుగా ఉంది.

అర్జు : మనరాకవలననా?

శాండి: మనరాకవలన కలిగిన గగ్గోలు సరే. ప్రభువు నిన్నసాయం కాలము చనిపోయాడట.

అర్జు : పాప మెందుచేతనో? సైంధవుని కుమారుఁ డతఁడు, సుమనస్కుఁ డనెడివాఁడు. సైంధవుఁడు భారతయుద్ధమున మాచేతిలోఁ దెగినాఁడు. ఇతఁడుకూడ నిప్పుడు పోయినాఁడు కాఁబోలు. పాప మేమివ్యాధియో?

శాండి: వ్యాధీలేదు పాడూలేదు నీవల్లే చచ్చాడంట.

అర్జు : (సాశ్చర్యము) నావల్లనా? ఏమి యీయన్యాయము. అతనిని నేను చూడనుగూడఁ జూడలేదే.

శాండి: నీవు చూడకపోతేనేం, మన యాగాశ్వము నిన్న వారి గుఱ్ఱపు సాలలో ప్రవేశించిందట దాన్నిచూచి యిది యెక్కడదని భటులనడగ్గా వాళ్లు గుఱ్ఱం మొగానఉన్న పట్టమునుజూచి ధర్మరాజు నశ్వమనీ వెంట అర్జునుఁడు కాపాడుతున్నాడనీ చెప్పారట.

అర్జు : అవును గుఱ్ఱము మొగమున వ్రాసియేయున్నదిగదా.

శాండి: అర్జునుడు వెంటవస్తున్నాడని చెప్పగానే అతడక్కడే ఒక పెద్ద వెఱ్ఱికేకవేసి చచ్చిపోయాడట.

అర్జు : ఛీ పిఱికిపంద. ఇంతటి భీరువులు నుందురుగాఁబోలు. వీనికంటె సైంధవుఁడే ఘనుఁడు. మగనిఁ జంపినందుల కేడ్చుచున్న మా పెదతల్లి గాంధారి కూఁతురు దుశ్శలకీ పుత్రశోకమును

నావలననే వచ్చినది గాంబోలు. ఆ చెల్లెలిమొగము నేనెట్లు చూతును.

శాండి: ఆ పెద్దరాణి దుశ్శలమ్మగారు మనుమణ్ణి దీసుకొని నీదర్శనానికి రావటానికి ప్రయాణమవుతుందని జనులు చెప్పుకుంటూవుంటే విని యిట్లావచ్చాను ఇప్పుడైనా నాధీరత్వము నీకు తెలిసిందా?

అర్జు : ఇందులో నీధీరత్వమేమున్నది ?

శాండి: అయ్యో తండ్రీ! ఇంతమాత్రం గ్రహింపలేనివాడికేనా త్రిలోక విజయధురంధరుడనేపేరు ? కొంతమంది నీపేరువింటేనే చచ్చి పోతూవుంటే నేను జంకులేకుండా నీదగ్గఱనే ఉంటూవున్నాను గదా! వారికంటె ధీరుణ్ణికాదా మఱి ?

అర్జు : అవును. నీధీరత్వ మిప్పుడర్థమైనది పద శాళ్లుదము బసలోనికి, సాత్యకి ప్రద్యుమ్న వృషకేతనాదులు యాగవ్రతుండు నేమి చేయుచున్నారో.

(నిష్క్రమింతురు)

## 2-వ రంగము

(యాగవ్రత శాండిల్యులు ప్రవేశింతురు)

యాగ : శాండిల్యా! యీ గుఱ్ఱం దాని యిచ్చవచ్చినట్లల్లా పోతూ వుంది. దాని వెంటబడి మనమూ పోవలసిందే గదా. యిది యేప్రాంతము ?

శాండి : ఇదా మణిపురసమీపము.

యాగ : అయితే యిక్కడ, అర్జునుని భార్య చిత్రాంగద, కొడుకు బభ్రువాహనుడు, ఉన్నారట నిజమేనా ?

శాండి : అవును. ఉన్నారు.

యాగ : అర్జునుని భార్యాపుత్రు లిక్కడెందుకున్నారయ్యా ?

శాండి : నీకు తెలియదు గాబోలు పూర్వమర్జునుడు తీర్థయాత్ర చేస్తూ యిక్కడికి వచ్చి, యీ మణిపురాధిపతి చిత్రవాహనుని కుమార్తె చిత్రాంగదను జూచి వలచి ఆమెను తనకిమ్మని అడిగాడు.

యాగ : అప్పుడు చిత్రవాహనుడు కూతుర్ని యిచ్చే సేడన్నమాట. మఱి ఆమె యిక్కడే యెందుకు ఉంది ?

శాండి : చెప్పేది సాంతంగావిని ప్రశ్నించు.

యాగ : సరే చెప్పు.

శాండి : కుమార్తెను ఇచ్చేటప్పుడే చిత్రవాహనుడొక ఒడంబడిక చేసికొన్నాడు. తన కొక్కగానొక్క కూతురేయనీ. ఆమె నిచ్చటనే ఉంచవలసిందనీ, ఆమెకు గలిగే కొడుకును తనకే యీయాలనీ కోరాడు. దానికొప్పుకొని అర్జునుడు చిత్రాంగదను చేసుకొన్నాడు.

యాగ : ఓహో అదాసంగతి. అందుచేతనే పెళ్లాము, కొడుకు గూడ యిక్కడే ఉన్నారన్నమాట.

శాండి : నీకిప్పు డీప్రసంగ మెందుకు వచ్చిందేమిటి ?

యాగ : అర్జునుని వెంటనున్న రాజులు, నీలధ్వజానుసాళ్వాదులు తమలోతాము చెప్పుకొంటున్నారు.

శాండి : ఏమని ?

యాగ : బభ్రువాహను డర్జునుని కుమారుడనీ, మహాపరాక్రమవంతుడనీ, తండ్రి అని వదలితేసరేగాని లేక గుఱ్ఱాన్ని పట్టుకొంటే మాత్రము, విడిపించటం దుష్కరమనీ అనుకొంటున్నారు.

శాండి : అయితే కావచ్చును. అర్జునుని కుమారుడంటే మఱి సామాన్యంగా ఉంటాడా ?

యాగ : ఒకవేళ తండ్రిగారి అశ్వమని పట్టడేమోలే.

శాండి: అది తీసివెయ్యి. శౌర్యధనులైన క్షత్రియులకు పరాక్రమ విషయములో తండ్రీ లేదు కొడుకూ లేదు.

యాగ: పట్టుకొన్నాడంటే యిక యుద్ధమేనన్నమాట.

శాండి: ఏమియుద్ధమో నీవిప్పు డామాటంటేనే నాగుండె గుభాలు మంటున్నది. వాళ్ళకు బరాబరిగా ప్రాణాలు తీసుకోవటమంటే జంకులేదు గాని మనకావిషయాలు వింటూవుంటేనే భయము గదా.

యాగ: తప్పేదేముంది. గొంగడిలో అన్నంపెట్టుకుని వెంట్రుకలంటే ప్రయోజనము లేదు.

శాండి. అంతేలే ఆ యుద్ధగిద్ధము సొంతమయ్యేవఱకు మనమిద్దఱం దగ్గఱలోఉన్న యేపల్లెటూరుకో చేరదాము

(ఇద్దఱు నిష్క్రమింతురు)

తెరపడును

## 3 వ రంగము

(బభ్రువాహనుఁడు సింహాసనమున మంత్రి విశారదుఁ డొకయాసనమునఁ గూర్చుండి యుందురు. సైన్యాధిపతి ప్రసేనుఁడు ప్రవేశించును.)

ప్ర : ప్రభూ! నమస్కారము.

బభ్రు : ప్రసేనా! విశేషములేమి?

ప్ర : విశేషమును ప్రభువులకు విన్నవించుటకే వచ్చితిని. నేఁడొక యాగాశ్వము మన యుద్యానవనమునకు రాగాఁ జూచి పట్టుకొని యశ్వశాలలో బంధింపఁ జేసితిని.

విశా : సరే మంచిపనిఁ జేసితివి. కాని గుఱ్ఱమెవరిదో చూచితివా?

ప్రసే : చిత్తము. దాని ముఖపట్టమున నిట్లు వ్రాయఁబడియున్నది.

తే. సకలభూచక్రమేలు సజాతవైరి
యశ్వమేధీయహయమిది : యంగజారి
సనిఁదెరల్చిన నరుఁడు కాఁపాడు దీనిఁ
బట్టుకొనవచ్చు వీరసమ్రాట్టులున్న.

ఆవ్రాఁతఁ జూడఁగనే యేమీ యీనిరంకుశత్వమని యశ్వమును బట్టి బంధింపఁ జేసితిని.

బభ్రు : (నిట్టూర్పు నిగిడించి విషాదముతో) అక్కటా! ప్రసేనా! యెంతపొరపాటుఁ గావించితివి. నాతోఁ జెప్పక యేల చేసితివీపని? భరతకులప్రదీపకుఁడును సకలరాజన్య మకుటశిఖరాంచలస్థగిత నవరత్నరోచీరేఖానిత్యనీరాజిత పాదారవిందుఁడును, నిఖిల భువనరక్షాదీక్షితుండైన కమలాక్షునకు సాక్షాత్తు మేనమఱందియునైన మా పెదతండ్రి పాండవజ్యేష్ఠుని యాగాశ్వమునే బంధింపఁ జేసితివా? పైగా గుఱ్ఱము వెంటవచ్చుచున్నది, ఖాండవదావదహన సమయసంప్రీణితాగ్ని భట్టారక వినిర్జిత మహేంద్రుఁడును, రాజసూయావసర పరాజిత చతుస్సముద్ర వేలాముద్రిత వసుంధరావలయ మండనాయమానమండలేశ్వర సమూహుండును, గాలకేయనివాత కవచాది రాక్షససేనా సముదయాంభోధి కుంభభవుఁడును నెక్కటి పసరాన ముక్కంటి ధిక్కరించి పడవైచిన జగజెట్టియునైన మా తండ్రిగారు సవ్యసాచియఁటె.

ఉ. కట్టుపకాసియై హయముఁ గాచుచు వచ్చెడివాఁడు శూరస
మ్రాట్టు ధనంజయుండు, యజమాని యుధిష్ఠిరుఁ డామురాసుర
"ద్విట్టు" సహాయభూతుఁడఁట వీరలు నిందఱు పూజ్యులే గదా
పట్టఁగ వచ్చునే మనకుఁ బాండుకుమారుల యజ్ఞఘోటమున్.

సైన్యాధిపా! త్వరపడి యకార్యమొనరించితివి. నీచేసిన పని వలన నన్నుఁ బాండుపుత్రులు భావంబున నేమనితలంతురో గదా?

ప్ర : ప్రభూ! మీ లోకైకవీరత్వమునే నమ్మియున్న నా హృదయమునకు మిగిలిన విషయములు తోఁపమిచేఁ జేసిన నా యీ యపరాధమును మన్నింపుము.

విశా : దేవా! ప్రమాదవశమునఁ బ్రభువుఁ డీపనిఁ గావించినాఁడు. సవినయంబుగా గుఱ్ఱమును సురల ధనంజయులవారి కప్పగింతము.

బభ్రు : యాగాశ్వమునుబట్టిన పిదప గెలుపుగానీ యోటమిగానీ యుద్ధ మొనర్పవలయును. అది విధి : కాని మనకుఁ దండ్రిగారి యశ్వమును బట్టుటే తప్పై యుండఁగా నిఁక యుద్ధమున కవకాశ మెక్కడ నున్నది. నీ చెప్పినమార్గమే శరణ్యము.

తే. మనుజుఁడేనాఁడు త్వరపడి మంచిగాని
చెఱుపుగాని యొనర్పంగఁ జేటువచ్చు
నడుసుఁ ద్రొక్కినపిదపఁ గాల్గడిగినట్లు
తప్పుఁ గావించి సవరింత యొప్పుఁగాదె.

మంత్రీ! విశారదా! పురమున నుత్సవముఁ జాటఁబంపుము. రేఁపుదయముననే సపరివారముగా నేగి సాలంకృతంబైన యశ్వమును సబహుమానముగాఁ దండ్రిగారికి సమర్పించి క్షమాపణము వేఁడికొందము.

విశా : చిత్తము.

## 4 - వ రంగము

(అర్జునుఁడు, సాత్యకి, శాండిల్యుఁడు నాసనములపైఁ గూర్చుండి యుందురు)

సాత్య: దేవా! ధనంజయా! యశ్వరక్షకులు చెప్పిన వార్త నాలకించితివా?

అర్జు : ఆహా! ఆలించితిని.

సాత్య: గుఱ్ఱమును బట్టుటలో బభ్రువాహనుని యభిప్రాయ మేమై యుండును?

అర్జు : అభిప్రాయ మేమున్నది. శూరత్వమును బ్రకటించుటకే.

సాత్య: తండ్రుల యాగాశ్వమును బట్టియా శూరతను బ్రకటించుట,

అర్జు : తండ్రుల సవనహయమని యొకవేళ నతని కభిమానమున్నను, మిగిలిన పరివారమున కేలయుండును. వారి ప్రోత్సాహము మీఁదనైనను బట్టవచ్చును.

శాండి: తండ్రితో తగవులాడకపోతే తండ్రికంటే ఘనుఁడనే పేరెలా వస్తుందిలే.

(సేవకుఁడొకఁడు ప్రవేశించును.)

సేవ : గాండీవధరులకు జయమగుఁగాక (నమస్కరించును).

సాత్య: ఎవరునీవు?

సేవ : కుమార బభ్రువాహన మహారాజుగారి సేవకుఁడను. మాప్రభువుగారు మంత్రియుతులై మీ దర్శనమునకు లోనికిరా ననుమతి నర్థించుచున్నారు.

శాండి: (అర్జునుని వంకఁజూచి సేవకునితో) త్వరగా ప్రవేశపెట్టు.

(సేవకుఁడు నిష్క్రమించును)

(బభ్రువాహన విశారదులు ప్రవేశింతురు)

బభ్రు : సీ. నిఖల భూనాయకుల్ నివ్వెరపడ యంత్ర
మత్స్యమేసిన మహాత్మా! జోహారు
పైకొన్న యదువీర పటలిఁదూలిచి సుభ
ద్రాదేవిఁగొన్న శూరా! జోహారు
చిత్రసేనునిచేతఁ జెఱనడ్డ కురురాజు
వదలించినట్టి దేవా! జోహారు
సురతాణికొల్వు బంగరుగద్దె సగమందుఁ
బూజింపఁబడిన ప్రభూ! జోహారు

విల్లుపట్టినవారిలో నెల్లమేటి
యనఁగ విజయాఖ్యఁగన్న ధీరా! జోహారు
రమ్యమాణిక్యమగుట నీరాజనంబు
లివియె నీపాదములకుఁ దండ్రీ! జోహారు.

(వంగి నమస్కరించుచు) భాగ్యాధిదేవతవలె సన్నిధిచేసిన దేవరవారి దర్శనమునఁ గృతార్థుఁడనైతి. నా జన్మంబు సఫలమయ్యె. భరతవంశోత్తమా! తెలియక నా సైన్యాధిపతి మీయాగాశ్వమును బట్టినాఁడు. పిదప నేనెఱింగి విచారపడి బహుమానపురస్సరముగా గుఱ్ఱమునిదెగొనివచ్చితిగ్రహింపుడు.

శాండి: కుమారుడంటే యిట్లా ఉండాలె.

విశా: స్వామీ! సేనాధిపతి క్రొత్తవాఁడగుటచే నీప్రమాదము జరిగినది. దీనికై మాప్రభువుగారెంతయో యనుతాపపడిరి.

అర్జు: అనుతాపమెందులకు? మీశూరత్వమును బ్రకటింపఁదలఁచి పట్టి యజ్ఞాశ్వమునేల మరలఁదెచ్చితిరి? కానిండు మీపరాక్రమాతిశయమును జూపుడు చూచెదము.

బభ్రు: ప్రభూ! పరాక్రమమును మీసన్నిధానమునఁ బ్రదర్శింపవలయునను తలంపు నాకెన్నడును లేదు. ప్రమాదవశమున నిది జరిగెనని విన్నవించుకొనుచున్నాఁడను.

అర్జు: ఎట్టి ప్రమాదము? నీ సమ్మతిలేకయే. సేనాపతి గుఱ్ఱమును బట్టునా? నాయనుమతి లేక నాపరివార మేపనినైనఁ గావించునా?

బభ్రు: (దైన్యముతో) దేవా! క్షంతవ్యుఁడను.

తే. అతిపవిత్రములైన నీ యంఘ్రులాన
విశ్వవందితుఁడగు మహావిష్ణుఁడాన

నిజముగా నశ్వబంధంబు నే నెఱుంగ
దప్పు సైరించి బ్రోవుమీ తనయుఁ దండ్రి!

(పాదములపైఁ బడును.)

అర్జు : ఛీ! దౌర్భాగ్యుఁడా! నీ విట్టి నీచుఁడవని నేనింతవఱకుఁ దలఁప నైతిని.

(కాలితోఁ గిరీటమును గ్రిందఁ బడఁదన్నును)

శాండి: (అపవారించి) అరేరే. కొంపమునిగినట్లే, కాళ్లమీదపడే కొడుకును కాలితో తన్నటం శుభంగాదు.

సాత్య: (అపవారించి) ఇది మహాప్రమాదము (కిరీటమును బభ్రువాహనుని శిరస్సుననుంచును)

బభ్రు: దేవా! గాండీవధరా!

ఉ. తన్నినఁ దప్పు లేదకట తండ్రివిగావున నీకుమారుపై
నన్నిట నీకునున్నయవి హక్కులు దానికిఁ జింత లేదు, నీ
క్రొన్ననవంటి పాదమది క్రూరకిరీటముసోకి యెంతగా
ఖిన్నత నొందెనోయనుచుఁ గ్లేశము వొందెదఁ జుమ్ము నామదిన్.

(పాదమును బట్టుకొనఁబోవును)

అర్జు : (కాలితోఁ జేతుల నావలికిఁద్రోసి) ధూర్తుఁడా! నీ నక్కవినయములఁ గట్టిపెట్టుము. ఈబలాటమున ముందు గుఱ్ఱమును బట్టి వెనుక, వెను వెంటవచ్చు సమరసన్నాహసంకులంబగు మదీయ సేనాసముదయమునుగాంచి యదరిబెదరెత్తివచ్చి శరణు వేడినఁ బరాక్రమధనుండైన యీ గాండీవధరుండు సంతసించు ననుకొంటివా? ఛీ నీకెక్కడినుండి వచ్చిన దీపిటికితనము!

విశా : అది కలలోనిమాట, మీ కుమారునియందుఁ బిటికితనమున్న దనుట యగ్నిహోత్రమునఁ జల్లఁదనమున్న దనుటయే.

బభ్రు : తే. వెఱపుచేఁగాదు నేనిట్లు వేఁడికొనుట
వలయు జనకుండవని తలపంచినాఁడ
నరనరంబును వెదకిన నాదుమేన
భయము రవ్వంత మీకుఁ గన్పట్టదయ్య.

ఈకుమారుఁడు మీ నిగ్రహమున కర్హుఁడుగాఁడనుగ్రహింపుము.

అర్జు : (కోపముతో) తులువా! నీవు శూరుఁడవుగాకున్నను వచన శూరుఁడవని యిప్పటికిఁ దేలినది. ఎక్కడి కుమారుఁడవు. నీవంటి భీరువు నావంటి యుత్తమ వీరునకు జనించునా?

చం. తలఁపున సిగ్గులేక యిటు తండ్రియటంచు నృపాలకోటిలోఁ
బలికెద వేల యేపిఱికిపందకుఁ గన్నదొ నీదుతల్లి నా
వలనజనించు నొక్కొ నినువంటి పరాక్రమ వర్జితుండు, ఛీ
తొలఁగుముముందు నాయెదుట దోషము నీమొగమైనఁజూచినన్.

శాండి: వ్యవహారము మితిమీఱినది.

సాత్య: కటకటా విషయ మపమార్గమునఁబడినది.

బభ్రు : (చెవులుమూసికొని కోపముతో) మంత్రీ విశారదా! వింటివా తండ్రిగారిమాటలు. ఇఁక నా వినయవాక్యములు వ్యర్థములు. వందనము లనర్థఫలప్రదములు.

ఉ. తన్నినఁగాని యెట్టిబెడదంబులు వల్కినగాని యక్కటా
కన్నటువంటివాని కధికారములున్నవటంచు సైఁచితిన్
విన్నఁదనంబుగాఁగ బృనీపతు లిందఱిలోన శీలసం
పన్నను నాదుతల్లి నిటుబల్కిన నింక సహింపవచ్చునే.

పవిత్రచారిత్రయైన నాతల్లి చిత్రాంగద నేఁడు నామూలమున నీనరపాల సభామధ్యమున దూషింపఁబడియెఁ (క్రోధావేశమునఁ దెరవైపునకుఁ దిరిగి) జమూపాలా! ప్రసేనా! యింక

ఘట్టము సర్పింపవలసిన పని లేదు. తిరిగిపోనిమ్ము మన లాయ
మున బంధింపుము. దుర్మానమేదుర పాండవసేనావాహిని
మదీయనిర్వక్ర బాహావిక్రమ రసంబునందలి చవిఁజూడ నెంచినది.
దేవా! ధనంజయా! సెలవొసంగుము పోయివచ్చెద.

తే. గుడుసువాఱిన నావింటి గుణమునుండి
వెడలు కాండప్రకాండముల్ విన్నగప్పఁ
బంకనిర్మగ్న గోమాతపగిదినైన
నీదుసేనయె యెఱఁగించు నాదుజన్మ.

అర్జు : కానిమ్ము నీ పరాక్రమరసాస్వాదనమునకు సంసిద్ధులము.

(అందఱు నిష్క్రమింతురు)

తె ర ప డు ను

ఇది తృతీయాంకము.

# చిత్రాంగదానాటకము

## చతుర్థాంకము

### 1 - వ రంగము

స్థలము : అంతఃపురము, బభ్రువాహనుఁడు శయ్యపైఁ గూర్చుండి యుండును.

బభ్రు : (తనలో) నేనిప్పు డేమిచేయవలయునో తెలియకున్నది. ముందు నుయ్యి వెనుక గొయ్యి యన్నట్లు తండ్రితో యుద్ధమొనర్చిన నొకతప్పు, చేయకుండిన నొకతప్పు, ఎట్లైనఁ దప్పుఁజేయుటకే నానొసట వ్రాసియున్నది. ఇట్టి సమయమున నాసవతి తల్లి పాతాళవాసిని యులూచికూడ వచ్చుటయుచితమే. ఆతల్లులిద్దఱితోఁగూడ నింక నీ విషయమును జెప్పెదఁగాక (ముందునకుఁ జూచి) అదే మాతల్లి చిత్రాంగదయు, సవతితల్లి యులూచియు నిచ్చటికే వచ్చుచున్నారు. ఈవిషయము తెలిసినది కాఁబోలు.

(చిత్రాంగద, ఉలూచి ప్రవేశింతురు)

బభ్రు : తల్లు లిరువురికి నమస్కారము. (లేచి నమస్కరించును)

చిత్రాం : ఉలూ:చిరంజీవ, విజయీభవ, నాయనా ! కూర్చుండుము. (బభ్రువాహనుఁడు కూర్చుండును. తల్లులు చెఱియొక వైపునఁ గూర్చుండుదురు)

చిత్రాం : కుమారా ! ఏమిటి తండ్రిగారితో యుద్ధముసేయ సన్నాహ మొనరించుచున్నాఁడవని తెలిసినది ?

బభ్రు : అవును. తల్లీ ! సన్నాహమేమున్నది యుద్ధము మొదలైనయట్లే. సైన్యములు కదనాంగణమునకు నడచుచున్నవికూడ.

చిత్రాం : తండ్రీ ! నీకిదితగునా ?

బభ్రు : తగదని నాకును దెలిసియే యున్నది. కాని నేనేమి చేయుదును విధివిలసితమట్లున్నది.

చిత్రాం : బహుకాలమునకు మనదేశమునకు రాఁగాఁ దండ్రిగారినిఁ బూజింపవలసిన నీవు తెగువతోఁ గలహింపఁబూనుట యెంత హేయము.

బభ్రు : అట్లనియే నాశక్తికొలఁది బ్రయత్నించితిని. గాని ఫలము లేకపోయినది. నన్నుఁ జూడఁగనే యాజ్యాహుతులు వేసిన యగ్నిభట్టారకునివలె మండిపడుచున్నారు తండ్రిగారు.

ఉలూ : ఎందువలన ?

బభ్రు : ఎందులకని చెప్పుదును. నా పాపము.

చిత్రాం : పాపము లేదు. పాడు లేదు. ఆ పూరువంశోత్తముని పాదములపైఁబడి క్షమాపణముఁ గోరి యుద్ధము మాపుము.

బభ్రు : తల్లీ! పాదములపైఁబడుట వేఁడుకొనుట యన్నియు జరిగిపోయినవి. మిగిలినది యుద్ధమొక్కటే.

చిత్రాం : విషయమంతయును వింటిని పోనిమ్ము తండ్రిగారు తన్నినను దుర్భాషలాడినను దప్పులేదుగదా.

బభ్రు : సహించు దుర్భాషలుగావమ్మా! యవి.

చిత్రాం : అవును నిందించినది నన్నేగదా. నాకులేని బాధ నీకేల? కోపవశమున నీ తండ్రిగారన్నంత మాత్రమున నా శీలచరిత్రంబు లెవరెఱుంగరు ?

బభ్రు : ఎఱుంగుదురుగాక. నృపసభామధ్యమున నా జనకుఁ డాడిన మాట లగ్నికీలలై నా శరీరమును దహించుచున్నవి.

చిత్రాం : కుమారా! దీనికై యింత చింతింపవలదు. తండ్రి చేసిన దానికి నీకుఁ బరాభవము లేదు. నా మాట లాలింపుము.

మీయిద్దఱిలో నెవరికేమెగ్గు గల్గినను బాధపడు వారము మేమే.

బభ్రు : మీరు బాధపడుదురని నేను చేయవలసినదేమున్నది ?

చిత్రాం : యుద్ధము మానుకొనుము.

బభ్రు : యుద్ధము మానుకొనుటకు నా యభ్యంతరమేమున్నది ?

చిత్రాం : (సంతోషముతో నులూచివంకఁ జూచి) అక్కా మనము చెప్పినట్లే చేయును గుమారుఁడని నేను చెప్పలేదా.

ఉలూ : మానుకొనుటలో నభ్యంతరము లేకపోయిన మా వెంట రమ్ము. ఆయుధిష్ఠిరానుజుని యుద్ధము వలదని ప్రతిమాలుకొనఁ బోవుచున్నాము.

బభ్రు : పోయిన మీరు పోయిరండు, నేను వచ్చుట మాత్రము జరుగని పని.

ఉలూ : నీవురాకున్న మేముపోయిన ఫలముండునా ?

బభ్రు : నేను వచ్చినను ఫలముండదు.

చిత్రాం: మాతండ్రిగా నీవుకూడ వెంటరావలయును. (గడ్డము పట్టుకొనును)

బభ్రు : తల్లీ నన్ను నిర్బంధింపకుము, క్షాత్రమెట్టిదో యెఱుఁగని వని తలరు మీరు. రాజతంత్రమును విశేషించి చర్చించుట మీ కనర్హము.

ఉలూ: (చిత్రాంగదవంకఁ జూచి) చెలీ చూచితివా రాచబింకము పస.

చిత్రాం: నాయనా ! మా వెంటరావా ?

బభ్రు : రాను వచ్చుటకు వీలులేదు. మీరు వెళ్లుటయు ననవసరము.

చిత్రాం: ఇఁక యుద్ధము జరుగవలసినదేనా ?

బభ్రు : ముమ్మాటికి జరుగును. తండ్రి కుమారులం దన్నుకొనుమని మా మొగముల మూడుబంతులుపెట్టి విధి వ్రాసియున్నాఁడు.

చిత్రాం: నీకింత పంతమేల ? పుత్రా !

బభ్రు : నాకుఁ బంతములేదు. నేను మానవెంచినను దండ్రిగారు యుద్ధము మానఁడు.

చిత్రాం: మేముచెప్పి మాన్పించెదము.

బభ్రు : మీవలనఁగాదు.

చిత్రాం: పోనిమ్ము, మాచే నైనంతవఱకుఁ జూచెదము. మేము తిరిగి వచ్చువఱకు మాత్రము యుద్ధమునకు బయలుదేఱకుము. (గడ్డము పట్టుకొని) తండ్రీ మా ప్రార్థన మాలింపుము.

బభ్రు : మీరుపోవుటయేగాని పనిమాత్రముగాదు. పైగాఁ దండ్రి గారితోఁ జీవాట్లు దిని చెవులు జాడించుకొనుచు రావలసిన వారే.

ఉలూ: చివరికి జరుగునదంతే నట్లున్నది.

చిత్రాం: కానిమ్ము చీవాట్లయినను దిని వచ్చెదము. నీవుమాత్రము నిలువుము.

బభ్రు : సరే కానిండు మీమాటలఁ ద్రోసివేసినవాఁడ నేల కావలయును.

(నిష్క్రమింతురు)

## 2 - వ రంగము

(అర్జునుఁడు సాత్యకి కూర్చుండి యుందురు)

అర్జు : సాత్యకీ ! మణిపురంబున రణభేరి ప్రొద్దుననే మొరసినది కాని సైన్యములు బయలుదేఱిన జాడలేదే.

సాత్య: బయలు వెడలును. యుద్ధసన్నాహమంతయు సవరించుకొన వలయునుగదా.

అర్జు : బయలుదేఱునందువా ?

సాత్య: బయలుదేఱక యేలయూరకొందురు ?

అర్జు : నాకుమాత్రము నమ్మకము లేదు. ఆపిఱికిపంద యుద్ధమునకు వచ్చునా ?

సాత్య: పాండవోత్తమా! వాస్తవముగా నీకుమారునియందుఁ బిఱికి తన మున్నదనుట సాహసము. ఆచార్యుండవగుటచే నీకు వ్యతిరేకముగా నేను మాట్లాడుట యనర్హము. అయినను సమయమున మాట్లాడక తప్పదు.

శా. విత్రాసంబది వాసికెక్కెడిది దోర్వీర్యప్రభావంబులన్
శత్రుచ్ఛేదన పాటవంబునను జంచద్రూపసంపత్తి బం
ధు త్రాణంబున నిన్నుఁబోలు గుణధన్యుండాతఁడా ధర్మచా
రిత్రుం బుత్రుని ధిక్కరించితివి మీఱెన్ గార్యమిం కేటికిన్,

అర్జు : సాత్యకీ! యీ మందబుద్ధియందుఁ బరాక్రమమున్నదనుటకు నేనెంతమాత్ర మొప్పుకొనను. విక్రమవంతుఁడిట్లు చేయఁడు.

మ. సమరాశ్వంబును బట్టనేల? యిఁక రోషస్ఫూర్తిమైఁబట్టెఁ బో
పవరంబేటికిమానె, నూరక భయభ్రాంతాత్ముఁడై వచ్చి, నా
సవిధంబందున దీనుఁడై యడలునే శౌర్యంబిదే? వాని, నే
నవమానించుట దోషమానె యదుచంద్రా! మాటలిట్లుండునే.

సాత్య: నీకాగ్రహంబు వచ్చిన నేను వచింపలేను. కుమారుఁడు తండ్రికడ వినయంబు నెఱపుట దోషము మాత్రముగాదు. మన వెంటనున్న రాజశేఖరులందఱు బభ్రువాహనుని పేరు వినఁగనే సింహగర్జనంబువిన్న మృగయూథముపలె గజగజవడఁకుచున్నారు. నిశ్చయముగా నాకును నతని తేజోవిశేషమును జూచినదాదిగా భయము గలుగుచునే యున్నది. నిష్కారణముగాఁ జేతులారఁ దెచ్చుకొన్న బెడదయిది.

అర్జు : ఎంతమాటంటివి. సకల రాజలోకంబును భయపడుచున్నదని నన్ను బెదిరింపఁ జూచుచున్నాఁడవుగాఁబోలు. ప్రమథగణ పరివృతుండైన ఫాలాక్షుండు పైకొన్నను జంకెఱుంగనిగాండీవ ధరుని ముందటనా యీ బిభీషికలు. కాక

మ. మనుజేంద్రుల్ మహనీయశూరు లరిమర్మచ్ఛేదదక్షుల్ యశో
ఘనులిట్లెందఱు కూడివచ్చి హయమున్ గాఁపాడగాలేక యొ
క్క నికిన్ బాలున కోహటించిరన యుక్తంబౌనె యిట్లైనచో
మనలంజూచిన మూలనున్న ముసలమ్మల్ నవ్వరే సాత్యకీ!

(వినుట నభినయించి) ఎక్కడి దీ రథధ్వని ?

సాత్య: అదె యులూచీ చిత్రాంగదా దేవులిద్దఱు రథమునుండి దిగుచున్నారు.

అర్జు : నన్ను యుద్ధ విముఖునిఁ జేయవలయునని కాఁబోలు నీ వనిత లిద్ద అరుదెంచుచున్నారు.

## 3 వ రంగము

(చిత్రాంగద ఉలూచి ప్రవేశింతురు)

చిత్రాం: ఆర్యపుత్రా! నమస్కారము.

ఉలూ : ప్రాణేశ్వరా! వందనము. (ఇరువురు నర్జునునకు నమస్కరింతురు)

చిత్రాం: అక్కా! హృదయేశ్వరుని దర్శనభాగ్య మెన్నటికిఁగలిగినది.

అర్జు : అవసరమైనప్పుడైనను దర్శింపక తప్పదుగదా.

చిత్రాం: పడఁతికి భర్తృసందర్శన మొకప్పుడవసరము మఱియొకప్పు డనవసరమగునా ?

అర్జు : పోనిమ్మిప్పుడు నవసరమే యనుకొందము.

చిత్రాం: నాథా మీమాటయందర్థమును నేను గ్రహింపక పోలేదు. నిశ్చయముగాఁ గుమారుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట విని యడిగి మీరాకఁ దెలిసికొంటిని. అంతకుముందు నే నెఱుంగక రానందులకు క్షమింపుడు.

అర్జు: కుమారుఁడు మాపై యుద్ధసన్నద్ధుఁ డగుచుండగా నిప్పుడు మీ రేల వచ్చితిరి.

చిత్రాం: ప్రాణేశ్వరులకడఁ జనవుండుటచేఁ బ్రియకుమారునిపై నాగ్రహింపవలదని వేఁడుకొనుటకే.

అర్జు: ఛీ! పిఱికిపంద. యెన్నితంత్రములు పన్నుచున్నాఁడు. యుద్ధమును దప్పుకొనుటకు! ఇంత విక్రమహీనుఁడు గుఱ్ఱము నేల పట్టుకొనవలయును. ఇప్పుడు మిమ్మిట్లు బంపెనా?

చిత్రాం: నాథా కుమారునియందపభావమును బొందకుము. అతఁడు నీ కొమరుఁడై పిఱికిపంద యెట్లగును. విక్రమహీనుఁడునుగాఁడు. పితృవత్సలుఁడైన యతనిపై నాగ్రహించుట తగదు. మమ్ము వాఁడు పంపలేదు. అతనిని బలవంతముగా నాపి మేము నీసన్నిధికి వచ్చితిమి.

ఉలూ: అతఁడు మనలను బంపలేదని చెప్పినమాత్రమున నమ్ముదురా యీసమయమున?

అర్జు: నాకుమారుఁడేయైన నిట్లు పిఱికిపంద కానేకాఁడు.

చిత్రాం: అయిన నీకుమారుఁడు కాఁడనియా నీభావము.

ఉలూ: వేఱుగా మరల నడుగవలసినపని యేమున్నది?

చిత్రాం: ప్రాణేశ్వరా! ఎంత ఘోరమైనమాట యిది. పతివ్రతమైన పడతికి భర్త చంపినను నెట్లు తిట్టినను సహింపవచ్చును గాని పరపురుష సంబంధమున్నదనుట మాత్రము ప్రాణగొడ్డమువంటి దని యెఱింగియు నీవిట్లుపలుకుట నాపాపము.

అర్జు: ఇంతీ! యింతకు నీవేమనియెదవు.

చిత్రాం : కుమారు ననుగ్రహింపుమని విన్నవించెదను.

అర్జు : అదిమాత్రము ముమ్మాటికిఁ గుదురదు. ఊరక నీవేల బాధ పడెదవు ?

చిత్రాం : నాథా! యీకొడుకుపై మీకింత క్రోధము గలుగుటకు వాడేమి తప్పొనరించినాఁడు.

అర్జు : యాగాశ్వమునుబట్టుట తప్పుగాదా.

చిత్రాం : అది కేవలము సేనాధిపతి ప్రమాదమున జరిగినదిగాని వాఁడెఱుంగఁడు.

అర్జు : ఎఱుఁగఁడన్నంతమాత్రమున నేను నమ్మను.

ఉలూ : నమ్ముటకు వీలులేనిమాట నిజమే.

చిత్రాం : పోనిమ్ము. వాఁడే పట్టించెనందము. కుమారుని తప్పును దండ్రివై నీవు సహింపకున్న నింక నతనికి సైరించువారెవరు?

అర్జు : సహింపవలసినదే కాని పుత్రాదిచ్ఛేత్పరాజయమ్ శిష్యాదిచ్ఛేత్పరాజయమ్మన్నట్లుగాఁ బరాక్రమై కథనుండనైన నాయెదుట నీకొడుకు విక్రమించిన మెత్తునేగాని దీనముగా నడలినమాత్రమున మెప్పుగల్గునా ?

చిత్రాం : హృదయేశ్వరా! త్రిలోకములఁగల్గు ధనుర్ధరులలో నగ్రేసరుఁడవు నీవు. నీకొడుకో సర్వవిషయముల నీకేమాత్రము తీసిపోఁడు. అట్టి మీయిరువురు స్వసైన్యముగాఁ బోరుఁగావింప నూరక పోవునా? మీయిరువురిలో నెవరి కేమెగ్గుగల్గినను నేను భరింప గలనా ?

అర్జు : (నవ్వి) అన్నిట నీకొడుకు నాతో సముఁడన్నంతమాత్రమున నమ్మఁజాల

శా. దేవీ! యూరక పెద్దఁజేసి కొడుకున్ దివ్యప్రభావాఢ్యుగా
నీవీరీతి వచించినంతటనె మన్నింపంగ నేనేర్తునే
ద్రోణవాసుల్ వెలుగంద యుద్ధమునఁ ద్రోణ్తో రేఁగు నాచండగాం
డీవ జ్యానినదంబు విన్నపిదపన్ డీకొన్నచో మెచ్చెదన్.

చిత్రాం: నాథా! డీకొనుట మాత్ర మేగాను. రణాంగణమున నిన్నుఁ గొడుకు కలగుండుపడఁ జేయుటకును సమర్థుఁడు. అందులో సందేహ మేమాత్రమును లేదు. నేను వీరపత్నిని మాత్రమే కాదు వీరమాతననియుఁ దలంపుము.

అర్జు: కానిమ్ము కుమారుఁడంతటివాఁడైనప్పుడు సంతసించెదఁగాక,

చిత్రాం: దేవా! నీవప్పుడు సంతోషించినఁ బ్రయోజన మేమి? ప్రియపత్నినైన నాపలుకులాలించి కొడుకుపై నలుక మానుము.

మ. కొడుకున్ ధర్మచరిత్రుఁ గైకొనుము నీకున్ వానికిన్ బోరుదోం
దడిమైనన్ విను పుత్రశోకమగు లేదా ఘోరవైధవ్యమో
బెడిదంబై చనుదెంచునాకు, నిటు కావింపంగ న్యాయ్యంబె, నీ
యడుగుల్ బట్టి నుతించెదన్ గరుణనాథా నన్ను రక్షింపుమా

(పాదములపైఁబడి యేడ్చును)

అర్జు: చం. జలజలరాలు నశ్రువుల సందడి నిద్దపుఁ జెక్కుటద్దముల్
మలినతనొందఁగాఁ బనికిమాలినదాని విధాన నేదియో
గలుగునటంచు నేడ్చెదవు కాఁగలదానిని మాన్పవచ్చునే
వలఁతులె యెవ్వరైనమగువా! విధివ్రాఁతకుమాఱు సేయఁగన్.

ధైర్యవతులైన నీవంటి వీరపత్నులకిట్లు విలాపించుట యుక్తము గాదు.

చిత్రాం: నాథా! దరిలేనిశోక పారావారంబున నన్నేల పడఁద్రోయఁ బూనెదవు?

చం. భరతకుల ప్రదీపుఁడవు భవ్యచరిత్రుఁడు ధర్మసూతికిన్
గరువపుఁ దమ్మువాఁడవు జగంబుల నెన్నిక గన్నవారికిన్
గురుఁడవు శాంతిఁ బోవిడిచి క్రోధవశంబునఁ బుత్రుఁ బుణ్యా త
త్పరుని వధింపఁ బూనుటిది భావ్యముగాదు తలంచిచూడుమా.

అర్జు: ఎన్నిసారులు తలంచి చూచినను నామనస్సు రణమొనర్చుటకే నిశ్చయపడుచున్నది.

ఉలూ : ఇంక మనము మాట్లాడుట యనవసరము.

చిత్రాం : అక్కటా నేనెంత మందభాగ్యను. నాథా! యీ ప్రియు రాలిపై నింత యాగ్రహ మెందులకు.

తే. తండ్రి! దయఁజూపుమరుచుఁ బాదములమీఁద
నొఱగు సుతుఁదన్నఁ జిత్త మెట్లొప్పెనయ్య
కోపమునఁ దన్నితివిగాక గొంతుఁగోయ
నెఱిఁగి నీచేతు లెట్లుత్సహించునయ్య.

అర్జు : ప్రాణేశ్వరీ! పెక్కుమాటలాడి నన్నేల విసిగించెదవు. విధి నన్నుఁ బ్రేరించుచున్నాఁడు కాఁబోలు, నాహృదయ మంత కంతకు నాగ్రహావేశ దూషితమగుచున్న దేకాని వెనుకకుఁ దిరుగుట లేదు. కుమారునితో మాత్రము యుద్ధము చేయక మానను వేయేల వినుము.

తే : బ్రతికి నేనున్నచో వీరపత్నివీవు.
మగువ కొడుకున్నచో వీరమాతవీవు
తనయుఁడో లేక భర్తయో దక్కఁగాని
యిరువురును నుండఁబోరమ్మ యింకనీకు.

చిత్రాం: అక్కటా ప్రాణేశ్వరా! నేనేమి సేయుదును.

ఉలూ: ఇంకఁ జేయున దేమున్నది. వచ్చినత్రోవ నింటికి నడచుటయే, మేటి మగలైనవారు విక్రమమునకే స్థానమిత్తురుగాని మిలిగిన విషయములనంతగాఁ బాటింపరు.

చిత్రాం: (దైన్యముతో) హృదయేశ్వరా! వచ్చినత్రోవ నూరక పోవలసిన దేనా ?

అర్జు : ముమ్మాటికిఁ బోవలసిన దే, వీరమాతవైతి వేని వెంటనే రణాం గణమునకుఁ గుమారునిఁ బంపుము.

చిత్రాం: (ఇంచుకంత కోపముతో) ఆర్యపుత్రా! పితృప్రియుండైన కుమారు నవమానించితివి. ప్రియపత్నినైన నామాటలు పాటింపక యన్యాయ్యంబున కుపక్రమించి, యుద్ధమున కే సంసిద్ధపడితివి. ధర్మరక్షితుండైన కొడుకుచేతఁ గదనాంగణంబునఁ జిక్కు పడి చీకాకుపడిన నీకుఁ బశ్చాత్తాపపడక తప్పదు.

అర్జు : పోనిమ్ము జయాపజయములు దైవాధీనములు.

(అందలు నిష్క్రమింతురు)

తెర పడును.

## 4 - వ రంగము

ప్రవేశము – యాగవ్రత శాండిల్యులు

శాండి: యాగవ్రతా! ఇక భయంలేదులే. పొలికలనుదాటి చాలా దూరం వచ్చేసాము. నిదానంగానే నడువు.

యాగ: ఇక భయంలేనట్లేనా? ఓరి నీయుద్ధంపాడుగాను. ఎంత భయంకరంగా ఉంది. నాశరీరం వణకింతవఱకూ పోనేలేదు.

శాండి: మనమీాగుట్టంవెంట బయలుదేఱిన పిదప ఎన్నో యుద్ధాలు చూచాము కాని యింత ఘోరంగా ఏదీ లేదయ్యా!

యాగ : ఘోరమని మెల్లగాఅంటావే. వాళ్ళకి మతే మెట్టాప్రాణాలొప్పుతున్నాయో. అట్లాచావటానికికాన్నేపట్లో యుద్ధరంగమంతా పీనుగులపెంట అయిపోయిందే.

శాండి : ఆ బభ్రువాహనుని సేనాధిపతిముందు అసలు లోకాలాగేటట్టేలేదు.

యాగ : బభ్రువాహనునిముందో.

శాండి : సరేసరి ఇక చెప్పవలసిందేముంది. మొన్న తండ్రికి నమస్కరించటానికి వచ్చినప్పుడెంతో సౌమ్యుడుగా కనిపించాడు.

ఇవ్వేళ చూడబోదుముగదా సంవత్సరమయు దుర్నిరీక్షుడగు నిటలాక్షు ననుకరిస్తున్నాడు.

యాగ : ఆ విసురుచూస్తే తండ్రి యర్జునుడేమీ చాలేటట్టు లేడే యుద్ధములో.

శాండి : మొత్తానికిది అర్జునునకు పెద్దదెబ్బే. చేతులార తెచ్చిపెట్టుకొన్నాడు. పాప మాబభ్రువాహనుని అనవలసిన పనిలేదు' తండ్రిగారని యెంతో వినయంతో వచ్చి నమస్కరించి గుఱ్ఱాన్ని అప్పగించబూనాడు. ఆ గుఱ్ఱాన్ని మెదలకుండా తీసికోగూడ దర్జునుడు. తన్ని యుద్ధానికి రమ్మనె ఈయన్యాయ్య మూరకే పోతుందా ?

యాగ : పోనీ యుద్ధమువద్దని భార్య చిత్రాంగదాదేవి వచ్చినప్పుడైనా మానుకోవలసింది.

శాండి : ఎంతుకుమానుకొంటాడు. ఎందఱికో ప్రాణాలు తీయ్యాలనో.

యాగ : అయితే ఆ చిత్రాంగదాదేవి పెళ్ళికిబోతూ పిల్లిని వెంటబెట్టుకొనిపోయినట్లు. ఆ ఉలూచి నెందుకు దీసికొనివచ్చినట్లు. ఒక్కమాటైనా సరీగా మాట్లాడిందా. పుల్లవిఱిచి ప్రొయ్యిలో బెట్టినట్లు యుద్ధం కావలసిందేనన్నట్లు మాట్లాడిందేతప్ప వద్దన్నట్లు లేదు.

శాండి : నిజమేనయ్యా ! నాకూ చిత్రంవేసింది ఆమెమాటలకు. ఆమె అభిప్రాయమేమిటో మఱి.

యాగ : చిత్రాంగదాదేవి మాత్రము ఎంత సొంపుగా మాట్లాడిందయ్యా స్త్రీయైతేమాత్రమేం. నేను మెచ్చుకొన్నాను ఆమె తెలివి తేటలకు.

శాండి : స్త్రీలలోమాత్ర మెంతెంతటివారు లేరు. మహాపతివ్రతలు. విద్యావతులు, మేధావతులు, శౌర్యసంపన్నలు ఉంటారు. ఆకారమునందు భేదమేగాని శక్తికి స్త్రీత్వమేమిటి పురుషత్వ

వేమిటి? గొప్పవాళ్లూఉంటారు. పనికిమాలినవాళ్ళూఉంటారు. మొన్న మణిపురం వచ్చేటప్పుడు త్రోవలో చండిసంగతి విన్నావుగా.

యాగ: ఆ! జ్ఞాపకం చేయనే చేసావు. సరిగ్గా ఆసమయానికి సంధ్యా వందనంలో ఉండిపోయాను. నాకు బాగా తెలియలేదు. ఆవిషయమేమిటి ? మనగుఱ్ఱం చండి రాతివిగ్రహానికి అతుక్కుపోయిందటగా.

శాండి : అవును. అతుక్కొని పోయింది. ఎన్నివిధాల జూచినా గుఱ్ఱం ఇవతలకు రాలేకపోయింది. అప్పుడు దగ్గఅనే ఒక ముని ఆశ్రమం ఉంటే అక్కడికి బోయాము నేనూ, అర్జునుడూను. వెళ్ళి యీవిషయంచెపితే ఆమె ఉద్దాలకమహర్షి భార్య అనీ ఆమె భర్తశాపముచేత రాతివిగ్రహంగా అయ్యిందనీ అర్జునుడు పైని చేయివేస్తే మరల ఎప్పటి చండి అవుతుందనీ చెప్పాడు.

యాగ: అర్జునుడు చేయివేయగానే విగ్రహముమాఱి చండి అయ్యిందా మఱి ?

శాండి : ఆహా! చేయివేయగానే స్త్రీ అయిపోయింది. గుఱ్ఱం వెళ్ళిపోయింది. వెంటనే ఉద్దాలకుడుకూడా వచ్చాడు. మఱి ఎక్కడున్నాడో యింతకాలంనుండి. మగడు పెళ్ళాముకలిసి అర్జునుణ్ణి ఆశీర్వదించి వెళ్ళిపోయారు.

యాగ: అసలు ఉద్దాలకుడు పెళ్లాని కెందుకిచ్చాడో శాపము ?

శాండి: శాపం ఎందుకిచ్చాడంటావా. ఆసంగతంతా మాకాముని చెప్పాడు. పెళ్ళిచేసికొన్నది మొదలు ఉద్దాలకుడిని ఏడిపించి మొట్టమన్ను చేసిందట ఆ చండి.

యాగ: ఏమిచేసిందో.

శాండి: ఏమి లేమున్నది. మగడు వద్దన్నపని చేయటం. చేయమన్నపని మానటం. పప్పువేయమంటే ఉప్పువేసేది.

యాగ: ఉప్పువేయమంటే.

శాండి: నిప్పువేసేది. ఇల్లూడ్చమంటే చాలు బయటి పెంటపోగంతా యింట్లో వేసేది. అన్నంనండ వేయంటేసరి.

యాగ: చిమిడిపోయేటట్లు వండేదా?

శాండి: ఎట్లాగో ఒకట్లా వండితే నాణ్యమే కుండబ్రద్దలుగొట్టి కూర్చుండేది. స్నానం చేయమంటే ఒళ్ళంతా పేడబూసుకొని వచ్చేది. జపమాల యిమ్మంటే తెంచి ముందుపోసేది పూసలు.

యాగ: చచ్చినట్లు మళ్ళా గుచ్చుకొనేవాడుగాబోలు ఉద్దాలకుడు.

శాండి: హోమకుండము మంటచేయమంటే కడివెడు నీళ్లుపోసేది కుండంలో.

యాగ: అబ్బో యిక నెట్లాచచ్చేటట్టు. దానితో పాప మాఉద్దాలకు డెట్లా వేగాడు.

శాండి; వేగక చేసేదేముంది. అట్లా మగవాళ్లను బాధపెట్టే భార్యా రత్నాలిప్పుడుమాత్రం లేరంటావా లోకంలో.

యాగ: ఏమోనబ్బా.

శాండి: ఆ సందేహమేమీ అవసరము లేదు. ప్రొద్దున మొదలుకొని సాయంకాలము వఱకూ అది లేదనీ యిది లేదనీ, తెచ్చినదాన్ని ధ్వంసపాడు చేసి భర్తలను వేధించే పెళ్లాలు నూటికేభయి మంది, భర్త అదుపాజ్ఞల్లో సంచరించి పతిభక్తికై ప్రాకులాడే మహాతల్లులు నూటికే పదిమందో, మిగిలిన వాళ్లంతా చండి అంతగాకపోయినా, దానిలో సగము అంశ అయినా ఉంటుంది. అట్టాటి పెళ్ళాలతో బాధపడేవాళ్లు కావలసినంత మంది. మగవాడు మర్యాదగలవాడైతే పదిమంది వినిపోతా రేమోనని, బయటికి రానీకుండా కప్పిపెట్టుకొంటూ ఉంటాడు.

వాళ్కూడా తేలికరకమైతే మగడూ పెళ్ళామూ జుట్టుజుట్టు వేసికొని వీధిలోబడుతూ ఉంటారు. అలాంటి స్త్రీలతో సుఖమేమీ ఉండదు సరిగదా ఆగృహము నరకకూపమే మగవానికి.

యాగ: మగవాళ్ళలో మాత్రం నీచులు లేరంటావా?

శాండి: అయ్యో! లేకపోవటమేమిటి. బంగారువంటి భార్యల్ని బ్రతికి ఉండగానే చచ్చినవాళ్ళతో సమానంగాజేసి ఏడిపించే బండ మగవాళ్లెంతమందో ఉన్నారు. వ్యభిచారులై ధనము శరీరము జారకాంతల కప్పగించి పతివ్రతలైన భార్యల మొగమైనా చూడక, చివరికి సర్వస్వముపోయి, రోగపీడితులై తమచే ధిక్కరింపబడిన భార్యలే గతిగాగా వ్యర్థులై బాధపడుచూ బ్రతికేవాళ్ళెంతమంది లేరు లోకమున! భర్త మానసము వచ్చినట్లు మెలగనేర్చినదే భార్య. భార్య హృదయప్రేమను చూరగొన్నవాడే పూరుషుడు. అట్టివారి దాంపత్యమే దాంపత్యము. సుఖాస్పదము. మిగిలినది బాధా హేతువు.

యాగ: చివరికి చండి యేమయ్యిందో?

శాండి: ఉద్దాలకుడు దానితో బాధపడుతూ కౌండిన్యుడనే ఋషి ఒకనాడు తన యింటికివస్తే ఆయనతో తనభార్య వృత్తాంతమంతా చెప్పుకొని ఖేదపడ్డాడు. అప్పుడాముని ఆలోచించి కావలసినపనివద్దనీ. అవసరము లేనిపని కావాలననీ చెప్పిచూడమని చెప్పిపోయాడు.

యాగ: అట్లాచెపితే సరిపోయిందా.

శాండి: ఆ! అన్నంకావలసిఉంటే వద్దని చెప్పేసేవాడు. వెంటనే యెత్తుకొని వచ్చిపెట్టేది. అవసరము లేకపోతే పెట్టమనేవాడు. ఇక పెట్టనేపెట్టేదిగాదు.

యాగ: తస్సాజిక్క ఇది బలే ఉపాయమే.

శాండి : ఈపద్ధతి ఉద్దాలకునకు అనువుగానే ఉంది. ఇట్లా జరిగిపోతూ ఉండగా తండ్రి తద్దినమువచ్చింది. ఆసాయంకాలము పిలిచాడు భార్యను. "రేపు మాతండ్రిగారి తద్దినం. నేను పెట్టదలచుకోలేదు. నేను జామున్రాద్దైక్యవఱకూ లేవను. నీవూ లేవవద్దు. ఇల్లలకవద్దు సదాచారులైన భోక్తలపిలువవద్దు. వంటచేయవద్దని" చెప్పివేసాడు.

యాగ : వద్దనేవఱకు చేసేసిందా ?

శాండి : ఆహా! తెల్లవాఱేసరికి ఇల్లలికి ముగ్గులువెట్టి యాచారసంపన్నులైన భోక్తలను బిలిచివచ్చింది. స్నానముచేసి సర్వపదార్థ సంపన్నముగా వంటచేసింది. శ్రాద్ధమునకు వలయు వస్తువుల నెల్ల సంగ్రహించింది. భర్తను స్నానముచేయించి తద్దినంపెట్టటానికై ఉద్యమింపజేసింది.

యాగ : బలేపనిజేసిందే.

శాండి : పాప ముద్దాలకుడు ఆనందపరవశుడయ్యాడు. కౌండిన్యుడు చెప్పినమార్గ మెంత బాగాఉన్నదని సంతోషించాడు. తద్దినము పూర్తి అయ్యింది. చివరికి పిండములను గొనిపోయి పెంటప్రోవుమీద వెయ్యి అని చెప్పడానికిబదులు ఆనందముచేత మైమఱచి పిండముల నెత్తుకొనిపోయి గోవుకు బెట్టమన్నాడు. వెంటనే యెత్తుకొనిపోయి పెంటకుప్పమీద పాఱవేసింది.

యాగ: అరేరే. అంతా వ్యర్థమై పోయిందే.

శాండి: అది చూచేసరికి ఉద్దాలకుడు భరింపలేకపోయాడు. ఆగ్రహోదగ్రుడై నీచురాలా పూర్తియైన పితృమేధాన్నంతా వ్యర్థం జేశావు నిన్నిక సహింపజాల. రాతిబొమ్మవై పొమ్మనిశపించాడు.

యాగ: రోగము వదలిపోయింది.

శాండి: అప్పుడు చండి మగనికాళ్ళపైబడి యేడిస్తే కరుణించి రాతిబొమ్మవై యుండి పాండవ యాగాశ్వమునుబట్టుకొని అర్జునుడు

నీపై చేయివేయగా అప్పుడు నీపాపము పోయి మరల స్త్రీ వవుదువని చెప్పి వెళ్ళిపోయాడు.

యాగ: అదా సంగతి.

శాండి సంగతి అదేగాని పద దగ్గఱఉన్న ఊళ్లోకి. వేళకు మనకింత పిండాకూడైనా వేసేవాళ్ళు దొరుకుతారో లేదో యీ వేళ చూచుకొందాము.

యాగ: సరే పద.

(నిష్క్రమింతురు)

## 5 - వ రంగము

(ప్రవేశము బభ్రువాహనుఁడు)

స్థలము - యుద్ధరంగము

(తనలో)

బభ్రు : సీ. ఆరుపై మున్నీట నందాలపాపగఁ
బవళించునట్టి దైవంబవీవె
యంబుజాప్తుని మహాబింబ మధ్యమునందుఁ
బొగడొందు బంగారుమూర్తివీవె
వేదపూరుషు శిరోవీథుల నిరతంబు
నసివాఱు దోలు నొయ్యారివీవె.
పుణ్యశీలుర మనః పుండరీకంబుల
దీపించుజ్యోతి స్స్వరూపమీవె.
ధర్మపరిపాలనైక తత్పరుఁడవీవె
నేరమింతయు లేక నిష్కారణముగ
నాగ్రహించిన తండ్రిపై నరుగునన్నుఁ
బ్రీతిఁగనుము కృష్ణా! మురారీ! ముకుంద.

ఉ. లేదు పరాజయంబెచట లేదు భయంబిఁక గర్భవాస జ
న్మాదివికారముల్ గలుగవాపదలెల్ల నశించిపోవు దా
మోదర! మాధవా యదుకులోద్భవ కేశవయంచుఁ బాడుచున్
నీదుపదాబ్జముల్ హృదయనిర్మలతన్ భజియించువారికిన్.

ప్రభూ! దైతేయమర్దనా! నీ పాదపద్మంబులే తోడుగా విధి లేక కౌంతేయ సధ్యమునిప్పై నెత్తిన నా కపజయంబు ముమ్మాటికిని లేదు.

(ప్రసేనుఁడు ప్రవేశించును)

ప్రసే: ప్రభూ! నమస్కారము.

బభ్రు: (చూచి) సైన్యాధిపా ప్రసేనా! యేమి విశేషములు?

ప్రసే: దేవా! విశేషంబులేమున్నవి. నేఁడు మన స్కంధావారంబును జూచినఁ జాలుఁ బాండవసేనాసముదంబు మొనకట్టక చెల్లాచెదరై పలాయనముఁ గావించుచున్నది.

బభ్రు: (ఉత్సాహముతో)

ఉ. అద్దిర! సైన్యపాల! తగినట్టి వజీరుఁడవీవు, పోరిలో
నుద్దిమె నీకుఁ గోపమిగులొత్తినఁ జంద్రకళావతంసుఁడున్
దద్దయుభీతిఁ బాఱిపోఁడొ ధర్మజుసేనలు మేలుమేలు, నే
నెద్దియొసంగి నీఋణము నేర్పడఁ దీర్పఁగ నేర్తు మిత్రమా!

(కౌఁగిలించుకొనును)

ప్రసే: దేవా! యింతె కంటె నాకేమి సన్మానము కావలయును.

బభ్రు: ప్రసేనా! చక్రధరుని యనుగ్రహంబున్నంతవఱకు మన పరాక్రమంబునకు వక్రత లేదు. నేటిరణంబున నాచే నీల ధ్వజాను సాళ్వాదిరాజులు పెక్కురు మడిసిరి. శ్రీకృష్ణ దేవుని పెద్దకుమారుఁడు ప్రద్యుమ్నుఁడు దీర్ఘమూర్ఛితుం డయ్యె. కర్ణునికొడుకు మేటిజోదు వృషకేతనుండు రెండు

ఖండంబులయ్యె. సాత్యకి దెబ్బతిని రణాంగణమునుండి తొలంగె. తండ్రి ధనంజయుల శరీరంబు రక్తమయంబై తూగాడునంతలో గుఱ్ఱములు రథమునీడ్చుకొని యావలికిఁ బోయినవి. ఇంక మనముందు నిలఁబడు మేటి విలుకాఁడెవండును నేటికిఁ గన్పట్టుట లేదు. తండ్రిగారిపని రేఁపు పూర్తిగాఁ బట్టించెదఁగాక. అదె సూర్యభగవానుం డస్తమితుండయ్యె. సేన లఁగివియించి వీటికిఁ బోనిమ్ము.

ప్రసే : ఈ యనుజ్ఞఁ గొనుటకే దేవరకడకు నరుదెంచితిని. సెలవు.

(నిష్క్రమింతురు)

## 6 - వ రంగము

(విషాదముతో నర్జునుఁడు సాత్యకి ప్రవేశింతురు)

అర్జు : సాత్యకీ! యెంతపనిజరిగినది. ఎగతాళిగా నారంభమైన యీ సంఘటనము ప్రాణాంతకమైనదిగదా. బభ్రువాహనుఁ డెంత చేసినాఁడు!

ఉ. చచ్చిరి పేరుఁగన్న నృపచంద్రములెందఱో నేఁడు, తోడుగా
వచ్చినవారిలోనఁ, బితృవత్సలుఁడా వృషకేతనుండు వై
యచ్చరకోటికైన వెనుకాడఁడువాఁడును నేలఁగూలె వి
వ్వచ్చుఁడు చిక్కె నిట్టులొక బాలునిచే నిటనేమిసెప్పుదున్.

యుద్ధమారంభమై నాల్గుదినంబులు కడచన్నవి. సముద్రమువలె ఘూర్ణిల్లు మన సేనావాహిని పలుచఁబడిపోయినది. పోలికలను పీనుఁగుపెంటలై భీభత్సరసము నెసకొల్పుచున్నది. ఆ కుమారుని బాణఘాతములచే నాశరీరము సయితము తూఁగిపోవుచున్నది.

సాత్య : దేవా ధనంజయా! యిటుచూడుము. నామేననంగుళమాత్ర ప్రదేశమైనను బాణవ్రణితముగానిది లేనేలేదు. (శరీరముఁ జూపించును)

అర్జు : అక్కటా కృష్ణానుగ్రహంబు మనయందుఁ బూర్తిగాఁ దప్పి నట్లు తోఁచుచున్నయది. ఆ చిత్రాంగదాకుమారుని బాణ వేగ మేమని చెప్పవచ్చును.

ఉ. నీఁకదలిర్పఖాండవము వ్రేల్మిడిఁగావ బలారివచ్చినన్
దాఁకితి, నింద్రకీలమున దంభకిరాతునితోడఁ బోరితిన్
గాక, ధనుర్గురుండు నలకర్ణుఁడు భీష్ముఁడు గొట్టఁగంటి, నీ
పాకములేదు వారియెడ బాణకళాపటిమంపుఁ బెంపునన్.

గాండీవంబు బెండువడిపోయినట్లున్నది. నా బాహువు లల్ప సారంబులై పోయినవి. మనంబుత్సాహహీనంబైనది. ఆసన్న మరణుండగు వానికే యేయవశకునంబులు గన్పట్టునని విందు మో యట్టి దుశ్శకునంబులన్నియు నాకుఁ దోఁచుచున్నవి. రవిమండ లము మధ్య పెద్దరంధ్రము గానవచ్చుచున్నది. తనుచ్ఛాయ శిరోరహితమై గన్పట్టుచున్నది. కన్నుల విస్ఫులింగములు రాలుచున్నవి. కపికేతన మూరక వడంకుచున్నది. రోదోంత రమునఁ గావిరి గప్పిపోయినది. ఉల్కలుపడుచున్నవి. ఇవి యన్నియును జూడ రేఁపే నాకు మరణంబు ధ్రువంబని తెల్పు చున్నవి. అక్కటా నాజీవిత కావ్యంబున కీయాగహయ రక్షణోపక్రమంబు శాంతివాచనంబు గాఁబోలు, సాత్యకీ! నా మృతికై యంతగాఁ జింతింపను.

ఉ. ఎన్నటికైన మానవుల కేర్పడు మృత్యువు, తప్పఁబోదు సు
మ్మన్న! యుధిష్ఠిరుండచట యాగహయంబునుబుచ్చినాఁడు, లో
కోన్నతమైన నా భుజబలోద్ధతిఁ దద్దయునమ్మి, యిట్టులా
జన్నము భిన్నమాటకు విషాదమునొందెదఁ జుమ్ము సాత్యకీ!

సాత్య: ధనంజయా! యాగభంగము మాత్రమేగాదు. నీమరణంబు విన్నపిదప సహోదరానురక్తుండగు భరతకుల పవిత్రుం డజాత శత్రుఁడు బ్రదుకనోపఁడు. మిగిలిన పాండవులు వానితోడి

వార గాంధారీ ధృతరాష్ట్రులును, గుంతీ ద్రౌపదీ సుభద్రాదు లైన మగువలును నగ్నిప్రవేశంబు సేయుదురు.

తే. పాండుపుత్రులె తన బహిఃప్రాణములుగ
సంచరించెడు జలజలోచనుఁడు నాదు
మరణమును మీవినాశంబు నెఱిఁగెనేని
నిమిషమైనను జీవంబు నిలుపఁడయ్య!

యాదవులందఱు నా జగన్నాథుఁ డస్తమించిన నింక బ్రతుక నోపరు. ఊరక యిట్లు భరతవంశము యదువంశము పొలిసి పోనున్నవి. కటకటా యెంత ఘోరమిది.

అర్జు: సాత్యకీ! నీవైనను బ్రాణముల రక్షించుకొని కరిపురంబున కరిగి యచట మనవారి కందఱికి, నిటజరిగిన వృత్తాంతమంతయు వచింపుము. మఱియు

సీ. అభిరామ గుణపూర్ణుఁడగు ధర్మజుని పాద
నళినంబులకు మ్రొక్కెనాఁడనను
ననుఁగూర్చి పెక్కుగా మనములోఁగుందుట
వలన లాభంబింకఁ గలుగదనుము
అంబుజాక్షునిఁబంపి యశ్వంబురప్పించి
జన్న మేవిధినైన జరుపుమనుము
జగతిపై రాఁబోవు జన్మజన్మమునందుఁ
దనకుఁదమ్ముఁడనౌట తప్పదనుము.
జయము నజయంబు దైవవశంబులనుము
విజయుఁడేనాఁటికైనఁ గన్పింపఁడనుము
నన్నుమఱచుటమాత్ర మన్యాయ్యమనుము
విధిబలీయము కర్మంబు విడువదనుము.

చిన్నన్నగారికి నమస్కరించి కవలఁగౌఁగిలించితినని చెప్పుము.

సాత్య: (ఆత్మగతము) ఎట్టి మహావీరున కెంతటి యాపత్తువచ్చినది!

అర్జు: శైనేయా. వేఱొకమాట.

సీ. ఏ దేవుకరుణచే నాదిభిక్షుఁడు లోక
సంహారకాస్త్రం బొసంగెనాకు
నేమాన్యుదయచేత నేకాకినై పోయి
పసులఁద్రిప్పితి నుపప్లావ్యమందు
నేజగత్ప్రభునండ రాజకోటులఁదోలి
సైంధవు నొకనాఁటఁ జంపఁగంటి
నేపుణ్యచారిత్రు ప్రాపునఁ బాండవుల్
మనుజులై మహిమీఁద మనుటగలిగె

నట్టి గోపాలశేఖరు నడుగుదోయి
బాష్పధారల మున్మారు పట్టి కడిగి
యంతిమంబైన వందన మాచరించి
యడిగితిని సేమమని చెప్పుమార్తి దెలియ.

సాత్య: హా! నేనేమి సేయుదును. (అర్జునునిఁ బట్టుకొని యేడ్చును.)

అర్జు: ఉ. ఏడువఁబోకుమన్న! విధియెంతటివారికిఁ దప్పదన్న! కాఁ
పాడగలేరు బంధువులు నాప్తులు దైవము నిగ్రహించినన్
నేఁడిట నింటిలోఁ దలప నిశ్చయమావల రేపు మంటిలోఁ
దోడయివచ్చు జీవునకు దుష్కృతముల్ సుకృతంబు నింతియే.

సాత్యకీ! నీవైనను జావు దప్పించుకొని యీ వార్త గజపురం
బునకుఁ గొనిపొమ్ము.

సాత్య: ప్రభూ! కపికేతనా! గురుఁడవైన నిన్నీయాపత్సముద్ర
మునవదలి నేనెట్లు పోనేర్తును. నీకంటెను నాకుఁ బ్రాణంబులు
తీపియా? కాదు. నా శక్తికొలంది చూచెద రేపాబభ్రువాహ
నునిపని.

అర్జు : ఈరాత్రి మనపాలిటఁ గాళరాత్రియై తోఁచుచున్నది. ఉదయ
మునఁ జూచికొందము, ప్రొద్దు చాల మసలినది పోఁలు పరుం
డుము రేఁపు సాయంకాలమునకుఁ గుమారుఁడో లేక యీ
ఫల్గునుఁడో భువిమీఁదనుండును. ఇరువురును మాత్రముండరు.

(నిష్క్రమింతురు)

## 7 వ- రంగము

(ప్రవేశము - బభ్రువాహనుఁడు, ప్రసేనుఁడు)

బభ్రు : ప్రసేనా! యుద్ధభూమి యెంత భయంకరముగానున్నదో
చూచితివా ?

ప్రసే : దేవరవారు పరాక్రమించినపిదప భయంకరము గాకేమగును.

బభ్రు : సాత్యకి శౌర్యమును గంటివిగదా.

ప్రసే : చిత్తము. మహావీరుఁడని చెప్పవచ్చును. ఆవేశముతోఁ దెగించి
కదనమొనర్చినాఁడు. గాని పాపము మీ గాంధర్వాస్త్రఘాత
ముచే రథమునుండి భువిమీఁదఁ దెళ్లి గాఢమూర్ఛ నొందిన
నాఁడు. అసలీనాఁటికి లేచునో లేవఁడో, సాత్యకి పడుటఁజూచి
క్రోధావేశమునఁ గన్నుల నిప్పులురాలఁ దండ్రిగారు ధనంజయు
లదే మనపై వచ్చుచున్నారు.

బభ్రు : కానిమ్ము.

(అర్జునుఁడు ప్రవేశించును.)

బభ్రు : దేవా! శ్వేతవాహనా! నమస్కారము. (నమస్కరించుచు)

ఉ. చచ్చిరి నీచమూపతులు సాత్యకి మూర్ఛమునింగె మన్మథుం
డెచ్చటనిల్చెనో దెలియ దెందఱొ మందిరి రాజశేఖరుల్
నొచ్చితిమీవు మిక్కిలి, మనోగతినిప్పటికైనఁ గ్రోధమున్
బుచ్చి కుమారు నన్నుఁ బరిపూర్ణకృపన్ గనుగొంట లెస్సగున్.

అర్జు : (క్రోధముతో) దురాత్మా! నాకెక్కడి కుమారుఁడవు.

చం. దురమున మందవిక్రములఁ దోలితిఁ గొందఱసంచు నూరకే.
గరువపుమాటలిట్లు పలుకన్ గమకింపకు రోరిదుష్ట! నీ
బిరుదులు బింకముల్ విడిచి భీతిఁదొలంగక నిల్వుమీ సురా
సురులకజేయుఁడంచు బలసూదన సూను నెఱుంగ వింతకున్.

ఇదే నాచండగాండీవ నిర్ముక్తకాండనాళంబుల నీప్రాణానిలం
బుల నొక్కత్రుటిలోఁ బీల్చెదఁ జూడుము. (శరసంధాన మభిన
యించును బభ్రువాహనుఁడు మూర్ఛపడును)

ప్రసే : (బభ్రువాహనుని లేపి కూర్చుండఁబెట్టి) దేవా! నీవింక నవక్ర
పరాక్రమంబున నుపక్రమింపవలయుగాక తండ్రియని పట్టి
పాలార్చినఁ బ్రాణంబులకు దూరంబగుదువు. కీర్తికాంతకుఁ
బ్రియకాంతుఁడవు కాకపోదువు.

బభ్రు: (లేచి క్రోధావేశమున) ఏమేమీ! భరతవంశోత్తమా! నా
యీ విక్రమ ప్రకటనంబుననైనఁ గుమారుఁడనని నీభావంబునఁ
దోఁపనేలేదా. తోఁచునట్లుగాఁ బరాక్రమించెద నిఁకఁ జూడుము.
మహీపాల సభామధ్యమున, సత్యశీలయైన నాతల్లి చిత్రాంగదా
దేవిని దూఱినందులకు, నిష్కారణముగా నన్నుఁ దన్నినందు
లకు ఫలంబనుభవించెదవుగాక.

ఉ. పట్టుగ సత్యమే యెపుడు పల్కుదునేని పరాంగనావళిన్
ముట్టకయుందునేని యఘమోచనుఁడైన మురారి నున్నఁజే
పట్టుట తథ్యమేని నరపాలశిఖామణి సవ్యసాచికే
పుట్టితినేని యీశరమపోయినరున్ దలఁద్రెవ్వ నేయుమా.

(శరసంధానమభినయించును)

తెర పడును.

ఇది చతుర్థాంకము.

# చిత్రాంగదా నాటకము

## పంచమాంకము

(స్థలము - మణిపురములో వీధి. మందపాలుఁడు తప్పెటతోఁ బ్రవేశించును)

మంద : (తనలో) తప్పెటవాయించే యిసోసములో మనతరవాతే యెవ్వడైనా ఛాంఛోత్, మాదిగ పనిలో మాత్తరం రమ్మను ఎవుడొత్తాడో పోటీకి. రెండుగలాసు లేసుకుని కూచున్నా నంటే అప్పుడు గనపడతది నాపనితనం. రోజుకి పది మూపా యల పనిచేస్తా. అయితేమేం లాభం ఈ రైతులు పెట్టటం తక్కువ. అదారిటీ యెక్కువ. ఆ యెంకయ్యగోరుమానానికి సంవచ్చరానికి సాకిచ్చేమిరాసి యిరవయి మానికలు. ఈ జీతానికిగాను అయనకి రెండు చెప్పులజోళ్ళియ్యాలి. ఎడ్డకి బొడ్డువార్లియ్యాలి. కుచ్చులియ్యాలి. చెరనాకోళ్ళియ్యాలి. పాతయ్యన్నీ బాగుజేసిపెట్టాలి. చరమం జూద్దామా ధర పెరిగి పోయింది. గిట్టదయ్యా జీతమంటే ఊరుకోరు. నేనేంజెయ్యాలి. (నిరూపించిచూచి) ఇదె రాజబవనం ఇక్కడోక కేకయేస్తా.

''తిరిలోక యిజయదురందరుడున్నా, లోకప్పెబువైన దరమరాజులవోరి తమ్ముడున్నా అయిన అరిజనులవార్ని మన బొబ్బరవావన మహారాజుగోరు యిద్దములో నరికేసి గెలుపొంది వచ్చారుగనుక, మనఊళ్ళో అందఱున్నా యిళ్ళలికీ, ముగ్గు లెట్టుకోనీ ఉచ్చవం జేసుకోవల్సిందిగా, దండుమీాద పెబువు పెసేనులవారి ఆగ్గిన ఓహో (ఢాం ఢాం ఢామ్మని తప్పెట వాయించును)

మంద : (ముందునకునడచి) ఎంకియ్యగోరు మందపాలా! మంద పాలా! చెప్పులు గుట్టరా అన్నాడు మొన్న. ఈ సంవ చ్ఛరములో ఇది ఆయనకి మూడో జోడు. తల్లిసిరగ పొట్ట

జెబ్బులు పెట్టి కుట్టిచ్చా (నవ్వును) అయి తెగిపోయిఉండాలి. ఎక్కడన్నా కనబడతాడో యేమో ఆదొర. కనబడితే బండ కఱ్ఱదీసుకు పైకివత్తాడుగద. అదే నాకు బయం (ఇటు నటు చూచి) ఇదుగో రాజుగారి ఆత్తాన మంటపం. యిక్కడొక కేక యేస్తా.

"తిరిలోక యిజయపురందరుడున్నూ లోకప్పెబువైన దరమరాజులవోరి తమ్ముడున్నూ అయిన అరిజనులవార్ని మన బొబ్బరవావన మహారాజుగోరు యిద్దములో నరికేసి గెలు పొంది వచ్చారుగనుక, మన ఊళ్లో అందఱున్నూ యిల్లలికీ, ముగ్గులెట్టుకోనీ ఉచ్చవం జేసుకోవల్సిందిగా దండుమీద పెబువు పెసేనులవారి ఆగ్గిన ఓహో (ఢాం ఢాం డామ్మని వాయించును)

(భటుండొకండు ప్రవేశించును)

భటు: ఒగేయ్ మందపాలా! ఆపి వెయ్యి ఆచాటింపు ఇక వేయటానికి వీల్లేదు.

మంద: ఆ! ఆపెయ్యటమే సామేన్నంగా. నేనెవ్వుణ్ణి అనుకొన్నా, మామాదిగోళ్ళకందటికీ నాయకుణ్ణి మనదెబ్బకి అంటఊా రద్దే ఛాంఛోత్.

భటు: అవును లేవోయ్. నేనెవడనో తెలుసానీకు. నీమొగుణ్ణి అనుకో.

మంద: ఏయ్ జాగర్త. దండుమీద పెబువు పెసేనులవారి ఆగ్గనెమీద యేత్తన్నా చాటింపు. ఆపెయ్యమంటన్నావే. ఆకాయి గూకాయి యెవ్వార మనుకొన్నావుగామాలు.

భటు: తెలుసులేవోయ్, ఆ ప్రసేనుఁడే చాటింపు నాపివేసిరమ్మని నన్ను పంపించాడు. ఇక వేస్తే యిదిగో లాటీకఱ్ఱ చూచావా. వీపీ తప్పెట రెండూ పగుల్తయి.

మంద: (బాగాచూచి) ఉండవయ్యా మొగడా మీలాటీకఱ్ఱలాళ్లతో పడలేము. నిజంగా ఆపెయ్యమంటవా.

భటు: ఆ! నిజంగా నీచాటింపువిని ప్రభువుగారు ప్రసేనుని బిలిచి "తండ్రిగారిని నఱకటమే తప్పైతే చాటింపుగూడా వేయిస్తున్నావా" అని కోపపడి అంతఃపురములోనికి వెళ్ళిపోయారట ప్రసేనుడు నన్నుపిలిచి చాటింపునాపివేసిరమ్మని పంపించాడు.

మంద : సరేలేబాబు అట్టాజెప్పవే. నాకేఁ తప్పెట బుజానతగిలించుకొని మెల్లిగా కొంపజేరతా.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము

## 1 - వ రంగము

స్థలము : అంతఃపురము చిత్రాంగదపడియుండును, ఉలూచి కూర్చుండి వీవనతో విసరుచుండును.

ఉలూ : నేనెన్ని శైత్యోపచారములుచేసినను నీమెకు స్పృహవచ్చునట్లు లేదే.

(బభ్రువాహనుఁడు ప్రవేశించును)

బభ్రు : తల్లీ నమస్కారము. (చూచి ససంభ్రమము) అమ్మా యేమిది మా తల్లిగారిట్లు పడియున్న దేల ?

ఉలూ : తండ్రీ నీ విజయంబును, విజయుని మరణంబును వీధిలోఁ జాటింపువేయుచున్నారని చేటికవచ్చి మాతోఁ జెప్పినది. ఆ వార్తవినగనే నీతల్లి యిట్లు విలుచుకొనిపడినది. అప్పటి నుండియు నెన్ని శీతలోపచారము లొనర్చినను లేవనేలేదు.

బభ్రు : (దైన్యముతోఁ దల్లిని లేవఁదీసి కూర్చుండఁబెట్టి) తల్లీ కన్నులు విప్పి యొక్కపరిచూడుము.

చిత్రాం : (మెల్లగాఁ గన్నులువిప్పి చూచును) కుమారా! బభ్రువాహనా! తండ్రిగారి నేమిచేసివచ్చితివి.

బభ్రు : (మాటాడక తలవాంచును)

చిత్రాం : కుమారా !

చం. జనకునిఁ ద్రుంచివట్టి శితసాయకమున్ నిగిడించి యింక నీ
జనని ననున్వధించి రవిచంద్రులు మింట వెలుంగునంతకున్
ఘనమగుకీర్తి లోకమునఁ గైకొనుమయ్య విలంబమేల నేఁ
జనియెద భర్తవెంటఁబడి సాంద్రసుఖంబుల నొందుమీావిటన్.

హా! తండ్రీ! తొల్లి భార్గవరాముఁడు తండ్రియానతిచే మాతృ
వధముఁగావించె నీవెవరియాజ్ఞలేకయే ప్రాయశ్చిత్తమైనలేని
పితృవధ మొనర్చితివి. కర్ణునిఁ జంపినందులకే కుందుచున్న
యా ధర్మసుతుఁ డీవృషకేతనుఁడు నీచేతఁ బడినందుల కెంత
చింతించునోగదా.

బభ్రు: తల్లీ! పితృఘాతినైన నాకు వేఱుగతి యేమున్నది. ఆత్మ
హత్యఁగావించుకొని శాశ్వత నరకకూపంబునఁ బడియుండు
టయే ప్రాయశ్చిత్తము,

చిత్రా: అక్కటా పుత్రా! తండ్రినిఁజంపి యాదుఃఖమున మమ్మందఱఁ
జచ్చునట్లు గావించి నీవు నాత్మహత్యఁ గావించుకొనుటకేనా
యుద్ధముఁగావించినది.

బభ్రు: అమ్మా! విషయమంతయు నెఱిఁగియు నీవిట్లన్న నేనేమి
సెప్పుదును.

ఉ. కొట్టిన నొక్కవేళ మదిఁగోపముగల్గదు నీవుతండ్రికిన్
బుట్టగలేవఁటన్న వినిపోవునె యూరక యెవ్వఁడైన, న
న్నట్టు నృపాలమధ్యముననాడెను, నేనొకరాచబిడ్డనై
యెట్లు సహింతునమ్మ వచియింపగదమ్మ తలంచియింతయున్.

నన్నుదూఱినందు వలనఁ బ్రయోజనము లేదుగాని,

తే. కొడుకునై పుట్టి జనకుని గొంతునఱకి
మాన్యవృత్తుల తల్లుల మానసముల
నిప్పుఁబెట్టిన పాపాత్ము నీచచరితు
శాపమునఁజేసి పాలియింపు జనని! నన్ను.

చిత్రాం: కుమారా! పాలికలనఁ దెగిపడియున్న యీభరతవంశోత్తముని, నాలోకాధివీరుని దేహమును దర్శించి సహగమన మొనర్చెద. మమ్మటకుఁ గొనిపొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

తెర పడును

## 2 - వ రంగము

స్థలము యుద్ధభూమి, ఉలూచీ చిత్రాంగదలు బభ్రువాహనుఁడు ప్రవేశింతురు. తలకనఁబడకుండఁ గప్పఁబడి యర్జునుఁడు పడియుండును.

ఉలూ. చిత్రాం : హా! నాథా! యెట్టిదశ ప్రాప్తించినది నీకు. (అర్జునుని పాదములపైఁబడి దుఃఖింతురు)

ఉలూ : ముప్పదిమూడుకోట్ల దేవతలు నలువదియాఱుకోట్ల రాక్షసులు ప్రోవై వచ్చినను నీయెదుర నిల్వలేరే. అట్టి జగజ్జెట్టివైన నీవొక బాలునిచే రెండు ఖండములుగాఁ దెగిపడితివా ప్రభూ!

చిత్రాం : హా ప్రాణేశ్వరా! ధర్మగరిష్ఠుండైన యుధిష్ఠిరుని యశ్వమేధంబు నేమిగావించి లోకాంతరంబున కేగితివి. కుంతికన్నకడుపు శోకంబునుడుప దేని నిరూపించితివి. ద్రౌపదీ సుభద్రాది కాంతామతల్లుల బలువంత కేది యవధిఁ జేసితివి.

తే. ఆర్తినల్లాడుచున్న నిల్లాండ్రమమ్ముఁ
గరుణదళు కొత్తగాఁజూచి గారవింపు
జగతిబెగడొందగా వీరశయ్యనొంది
మహినినిదురింపఁజెల్లునే మగలరాయ!

ఉలూ : జీవితేశ్వరా! నీవులేనికతన లోకంబు నిర్గతశౌర్యంబును భరతవంశము ప్రాభవకళాశూన్యమ్మును నైనవి.

చిత్రాం : భరతకులపవిత్రా! నీవు నేనెందులకు భార్యనైనట్లు!

సీ. పెండ్లియాడుటెగాని పేర్మిఁ గోటఱికంబుఁ
జననాఁటఁ గుంతికిఁ జేయనైతిఁ
పతికిరీటియటంచుఁ బల్కుటయేగాని
నీపాదశుశ్రూష నెఱపనైతి
మగనాలితనమున మనుటమాత్రమెగాని
తెగువమై నీయిల్లు దిద్దనైతిఁ
గుదురుగాఁ బుట్టింటఁ గూర్చుండుటయెగాని
యిడుమలు నీతోడఁ గుడువనైతి

నట్టిపను నెల్ల ద్రౌపది యలసుభద్ర
సేయనోచిరి నేనేమిసేయకున్నఁ
గొడుకునొక్కనిఁగంటి నిన్గూల్చువానిఁ
బాపచారిత్రనయ్యయో ప్రాణనాథ!

(మూర్ఛపడును. ఉలూచి లేవఁదీసి కూర్చుండఁబెట్టును.)

బభ్రు: (దుఃఖముతో) తల్లీ! యీ నృశంసుని నీవు గర్భమున వహింపకుండవలసినది. ఒకవేళ వహించినను బసితనముననే గొంతుక పిసికి యసువులకు దూరముగాఁ జేసిన నిప్పుడింత వుట్టదుగదా. ఇపుడు శోకించినఁ బ్రయోజనమేమి ?

తే. అవని నాబోంటిదుష్టుని నాత్మజునిగఁ
గడుపునను గాంచి పోషింపఁ గలుగ కేల
తప్పునోయమ్మ దుఃఖంబు, ధరణిలోన
ఫణికిఁ బాల్వోసి పెంచి కీడ్పడక యున్నె.

చిత్రాం: తండ్రీ! ఇఁక విచారించుటవలన ఫలము లేదు. చితిఁ బేర్పింపుము, అగ్నిప్రవేశ మొనర్చి పతిలోకగామినినై పోయెద.

ఉలూ: చెల్లెలా చిత్రాంగదా! త్వరపడకుము. ధైర్య మవలంబింపు మొక్క రహస్యంబుఁ జెప్పెద నీవును గుమారుఁడును సావధానముగా వినుఁడు. ఈ గాండీవధరుండు శిఖండి నడ్డుపెట్టు

కొని, భీష్ముని జంపెనని యాగ్రహించి యష్టవసువులు శాప మొసంగనుండిరని నాకుఁ దెలిసినది. వెంటనే మాతండ్రినిఁ బంపి వారినిఁ బ్రార్థింపఁజేసి యాకోపమునుడిపితిని. కాని యర్జునుఁడు కుమారుఁడైన బభ్రువాహనుని చేతిలోఁ జచ్చిన నీ భీష్మవధ పాతకమునుండి విముక్తుఁడగును. లేకున్న నరకము తప్పదని నుడివిపోయిరని మా తండ్రి చెప్పెను. అందుచే నా పాపము వోవుటకుఁ గుమారునకును దండ్రికిని యుద్ధము గలుగుటకై నేనును బ్రయత్నించితిని. ఇప్పుడా భీష్మునిఁ జంపిన పాపము ధనంజయుని విడిచిపోయినది. భరతకుల వరేణ్యుఁడైన యర్జునుండు బ్రతుకు నుపాయమునుగలదు. మా పెదతండ్రి శేషునికడ సంజీవనమణి యున్నది. దానిఁ దెచ్చిన నీ మహావీరుఁడు బ్రదుకును. వృషకేతనుఁడును జీవించును.

చిత్రాం: అక్కా! ఆ మణి మనకెట్లు వచ్చును ?

ఉలూ : మాపుండరీకుని దే పంపెద. పుండరీకా యిటు రమ్ము.

తెరలో

అమ్మా వచ్చుచున్నాను వచ్చుచున్నాను.

(పుండరీకుఁడు ప్రవేశించును)

పుండ : అమ్మా! యేమిపని.

ఉలూ : నీవు పాతాళమునకేగి యీజరిగిన గాండీవధరుని మరణము మా పెదతండ్రి శేషునితోఁజెప్పి నేను సంజీవనమణినిఁ దెమ్మంటినని వెంటనే నీవు దానిఁ దీసికొనిరావలయును.

పుండ : ఆమణిని నాచేతికిత్తురో యీయరో.

ఉలూ : ఇదే నామంగళసూత్రములును, మణి నిర్మితములైన తాటంకములు నానవాలుగా నిచ్చుచున్నాను. వీనిఁ జూపుము. తప్పక మణి నిచ్చెదరు (ఇచ్చును)

పుండ : (తీసికొనుట నభినయించి) సరేపోయివచ్చెదను.

చిత్రాం - బభ్రు - నీవతిత్వరితముగా రావలయును.

(పుండరీకుఁడు నిష్క్రమించును)

(తెరలో)

ఎంతపని జరిగింది! ఎంతపని జరిగింది అమ్మయ్యో అమయ్యో, (ఏడ్చును)

ఉలూ : ఎవరో యేడ్చుచు వచ్చుచున్నారు.

బభ్రు : తండ్రిగారి స్నేహితుఁడు శాండిల్యుఁడువలె నున్నది. ఈ విషయము తెలిసినది కాఁబోలు వచ్చుచున్నాఁడు.

(శాండిల్యుఁడు ప్రవేశించును)

శాండి : అక్కటా, అర్జునా నీవంటి మహాపురుషుడికే మృతి వున్నదా. ఇంకా మృత్యువును తప్పించుకొనే వాళ్లెవరు? ఇప్పుడే నాకీ వార్త తెలిసింది. ఇంకా యుద్ధం జరుగుతూనే ఉందని మేమనుకోవటం. ఇక ధర్మరాజు యజ్ఞమేమి చేస్తాడు. యజ్ఞమన్ని రోజులూ బాగా తిందామనుకొన్నా రామరామా! నా నోట్లో మన్నుపడింది. నేనేం జేసిచావను. అర్జునుడు చచ్చిపోయాడన్నమాట వినగానే నేనూ చచ్చిపోయాను. చచ్చిపోయేనచ్చాననుకుంటూ. ఇంతకూ నేను బ్రతికిఉన్నానా చచ్చిపోయానా (అర్జునుని దగ్గఱ గూర్చుండి యేడ్చును)

ఉలూ : విప్రకుమారా! యేడువకుము.

శాండి : (చూచి) ఏమమ్మా యింతపనీజేసి యింత నిబ్బరంగా ఉన్నారు!

ఉలూ : నీవును నిబ్బరముగానే యుండుము. ఈ భరతకులపవిత్రుని బ్రతికించుటకై పాతాళముననున్న సంజీవనమణినిఁ దెచ్చుటకు మా పుండరీకునిఁ బంపితిమి. అతఁడు రాగానే యీ గాండీవధరుఁడు లేచును.

శాండి : ఆఁ! సంజీవనమణిని దేవటమే.

ఉలూ . అవును. ఇఁక గొంచెముసేపటికెల్లా నామణి వచ్చును.

శాండి : మొత్తానికి చంపటానికీ బ్రతికించడానికీకూడ సమర్థులే సట్టుందేమీరు. అర్జునుడు బ్రతికేవిషయంలో నేనేడ్చేపనే ముంది యింకా.

ఉలూ : ఎవరును నేడువవలసిన పని లేదు.

శాండి : నేననుకొన్నంతే అయ్యింది. మేము గుఱ్ఱంవెంట బయలు దేఱుతుండగానే వెధవముండ యెదురయ్యింది. అర్జునా! అపశకునమయ్యా అంటే యజ్ఞంలో ఏదు రేమిటిలెమ్మన్నాఁ డీ మహానుభావుడు. అసలామెత్తుడు కాళ్ళాయన్ని యాగ బ్రాహ్మణ్ణి వెంటబెట్టుకోవద్దయ్యా అంటే విన్నారూ. ఆయనదే యీ చలవంతా. శనిగాడు. పైగా ఇప్పుడు అర్జునుడు చచ్చి పోయాడంట. కొంపమునిగింది రావయ్యా అంటే నేను జప ములో గూర్చున్నాను. అర్జునుడు చచ్చినా వెంటనే బ్రతుకు తాడు లే. జపములో నాకు తెలుస్తున్నది నేను రానన్నాడు. ఇట్టాటివాళ్ళ నేమిచెయ్యాలి. ఇట్టాటి సమయములోనా జపం.

చిత్రాం: విప్రోత్తమా! నావలనను నాకుమారునివలనను జరిగినదీ ఘోరము. ఎవరో వెంటవచ్చుటచే గలిగినదని వృధాగా నితరుల నేల దూషించెదవు. మమ్మేదూఱుము.

శాండి : అమ్మా నిన్ననవలసినపని లేదు. నీ కుమారుడు మహాను భావుల్లో అగ్రేసరుడసలు. పాపం గుఱ్ఱాన్ని గ్రహించమని యేమి బ్రతిమాలినాడు తండ్రిని, పాదాలమీదబడి. కాని యెందుకు వింటాడు. ఇంత జరగవలసిఉంటే.

ఉలూ : ఒకవేళఁ దండ్రికిఁ గోపమువచ్చినను గుమారుఁడు లొంగి యుండవలసినదేగదా.

శాండి : సరే నీవు చెప్పేది బాగానేఉంది. అసలిప్పుడు లోకంలో తల్లిదండ్రుల మాటవినే కొడుకెవడమ్మా. ఇంట్లో గూర్చునే మీబోటివాళ్ళకేం తెలుస్తుంది. తిరిగిచూచే వాళ్ళకు కనబడ తది. కొడుకులను గనటం. వాళ్ళనుపోషించటానికై నోరు

గట్టుకొని కడుపుకట్టుకొని అష్టకష్టాలు పడటం, వాళ్ళకు, అరికాల్లో ముల్లుగుచ్చుకొంటే వీళ్లు లబలబలాడటం, పెంచి పెద్దవాళ్లనుజేసి పెళ్ళిచేయటం ఇంతవఱకు తల్లిదండ్రులపని, ఇక పెళ్లయిన తెల్లవాటి వాళ్లు కొడుకులుగాదు గాడిద కొడుకులే. పెళ్లాముతోనేమో తల్లిని తన్నించటం తానేమో తండ్రి లగ్గంపట్టడం. ఇది మామూలైపోయింది. తండ్రిగట్టిన యింట్లోజేరి యేలుతూఉంటారు. కొడుకూ కోడలు. ముసలి వాళ్లిద్దఱు గేదెల చావిట్లో ఒకప్రక్కన పడిఉండాలి. కొడుకు లేమో పెద్దవాళ్ళయి పోషిస్తారనే ఆశ అడుగంటి యేడుస్తూ ఉంటారు. వాళ్ళు సంపాదించిన ఆస్తి ననుభవిస్తూ వాళ్లిచ్చిన దేహంతో సంచరిస్తూ కొడుకులై పుట్టి తల్లిదండ్రుల నలా ఏడి పిస్తూ ఉంటారంటే యేం జెప్పేటట్టు.

ఉలూ: తల్లిదండ్రులు సంపాదించిన యాస్తి ననుభవించుచు వారి నేడిపించుట చాల నన్యాయ్యము.

శాండి: అన్యాయ్యమని యెవరంటారమ్మా అప్పుడు, కొడుకూకోడలూ సరిగాచూడటంలేదని పెద్దమనుషులకు చెప్పుకొని సంచాయితీ పెట్టిస్తే. నీకేంరోగమా, ఆకొడుకు చెప్పినట్టుగా పడిఉండ రాదూ. కష్టసుఖాలుపడేవాడు వాడని పడుచువాళ్ళ తరపున మాట్లాడిపోయేవాళ్లు తప్ప ధర్మం జెప్పేదెవరు ?

ఉలూ: అవును. ముదుసళ్ళ పక్షమునఁ జెప్పుటకు వారివలన నిప్పు డేమియుఁ బ్రయోజనము లేదుగదా చెప్పువారికి.

శాండి : అంతే. ప్రయోజనాన్నాసించి చెప్పేవాళ్లుతప్ప ధర్మాన్ని వివేచించే వాళ్ళెవరు? ఇక మంచానబడితే అసలేచూడరుగదా. వేళకింతముద్ద వాళ్లదయవస్తే వేయటం లేకపోతే లేదు. మెదిలితే తన్నరావటం ఇట్లా మలమూత్రాల్లో కొట్టుకొని కొట్టుకొని చావాలి. చచ్చినతరువాత కనిపెంచి ఆస్తులిచ్చి పోయిన తల్లిదండ్రులను జ్ఞాపకం జేసికోవటానికి సంవత్సరాని కొక తద్దినమైనా పెట్టరు.

ఉలూ: ఇప్పుడు తల్లిదండ్రులను జూడకపోయిన రేపు ముసలితనము వచ్చినపిదప వీరిగతియు నంతేగదా.

శాండి: అంతగా కేముంటుంది. అయితే అజ్ఞానమేది. ఈ బాధపడే ముసలివాళ్ళూ పడుచుదనములో తల్లిదండ్రుల నట్లాబాధ పెట్టినవాళ్ళే. అప్పుడు తెలియలేదుగా ఆబాధ. ఇప్పుడు అనుభవిస్తూఉంటే తెలుస్తూఉంది. అంతేవీళ్ళసంగతి. రేపు, అనుభవిస్తూ వీళ్ళూ యేడుస్తారు.

ఉలూ: ఎవరిమూలమున నీదేహముకలిగెనో యట్టి తల్లిదండ్రులను బూజింపనివారు మనుష్యులేగారు.

శాండి: పూర్వము, రామచంద్రస్వామివారు, తండ్రికోఱ్కై యఖండ సామ్రాజ్యము నేవదలి అరణ్యానికి వెళ్ళిపోయాడు. తలిదండ్రుల ఋణ మెలాతీరుతుందో పితృభక్తి అంటే ఎలాంటిదో అలాంటి మహాపురుషులకు తెలుస్తుంది. ఇప్పుడు కొడుకులు తపేలాబుజ్జి దగ్గఱ తగవుపడి తండ్రితల పగలగొట్టటానికి తయారవుతున్నారు తల్లిదండ్రులని గౌరవప్రతిపత్తులతోఁ జూచే జ్ఞానవంతులు ఏ కొద్దిమందో ఉంటారు.

(పుండరీకుడు ప్రవేశించును)

ఉలూ: పుండరీకా! మణిఁదెచ్చితివా?

పుండ: అమ్మా నేను వెళ్ళి నీ చెప్పినమాటలన్నియు శేషునికిఁ జెప్పితిని. ఆయన విచారపడి మణినిచ్చుటకు సంసిద్ధుఁడైనాఁడు. కాని యింతలో నాసర్పకుల ముఖ్యులందఱు ప్రోవువడి మనుష్యులు సర్పజాతికి విరోధులని మణినిచ్చుటకు వీలులేదని యడ్డుపెట్టిరి. వారిమాట దాఁటలేక మీ పెదతండ్రియు మణినీయ నొనువు పడడు. పొమ్మని నన్నుఁ బంపినాఁడు.

చిత్రాం: మన మందభాగ్యత యచ్చటను నెదురైనదిగాఁబోలు.

ఉలూ: పుండరీకా! నేనిచ్చిన యానవాలు చూపలేదా.

పుండ: చూపితిని. ఐనను నిచ్చుటకు వీలులేదు పొమ్మనినారు.

చిత్రాం : అక్కా! యాపత్తులోనున్న మనల నెవరాదరింతురు.

తే. అన్నివిధముల బాగుగానున్న యప్పు
డందఱును బంధువులమందు రాసరమున
నొచ్చియున్నట్టి సమయానవచ్చి ప్రీతి
సూపనోపఁడు దగ్గఱిచుట్టమైన.

ఉలూ : (కోపముతో) ఏమీ! నాగు లెంతపనిగావించిరి. కుమారా! బభ్రువాహనా? చుఱుకు తగిలినఁగాని యిఁక భోగవతీవాసులు మణినీయరు. నీవు పోయిరమ్ము. ఫల్గునుండు మడిసెనన్నమాత్ర మున, నేనంత సులుకనై పోయితిని గాఁబోలు,

బభ్రు : తల్లీ! నాగకాంతామతల్లీ!

తే. దెబ్బచేత నెదయ్యంబు తెరలిపోవు
దెబ్బచేతనె పశువులకబ్బుబుద్ధి
మందమతులకు దెబ్బయే మందుసుమ్ము
దండమెప్పుడు ధరలోన దశగుణంబు.

నీయాజ్ఞయైనచో నా పాతాళలోకంబుఁ బ్రనర్తిత భూత బేతాళ ఘూకంబుగా నొక్కత్రుటిలోఁ గావించి మణిఁదెచ్చెద.

శాండి : ఓరిబాబోయి! నీమాటలు వింటుంటూనే పంచలు చెడు తున్నాయి.

ఉలూ : వత్సా! నీకుఁ దోడ్పాటుగాఁ బుండరీకునిఁగూడ వెంటఁ గొనిపొమ్ము.

బభ్రు : నేను రేఁపు సూర్యోదయమునకెల్ల మణినిగ్రహించి తెచ్చెద నంతదనుక జాగరూకతతోఁ దండ్రిగారి కళేబరశిరంబులఁ గాచి కొనియుండుడు. పుండరీకా! పద వెళ్లుదము.

(ధనుర్ధరుఁడై బభ్రువాహనుఁడు పుండరీకునితో నిష్క్రమించును)

అందఱు నిష్క్రమింతురు.

(తెరపడును)

# 4 _ వ రంగము

స్థలము : హస్తిపురము. ధర్మజ భీమసేనులు పీఠములపైఁ గూర్చుండియుందురు

ధర్మ : (విషాదముతో) తండ్రీ! భీమసేనా! యజ్ఞాశ్వము వెంట నర్జును డరిగి యాఱుమాసములు గడచినవిగదా

భీమ : అవును. ఇంక నాఱుమాసములకుగాని యశ్వము తిరిగిరాదు.

ధర్మ : ఈనాఁటి తెల్లవాఱుజామున నొక ఘోరదుస్స్వప్నమును గంటిని. అది మొదలు నా హృదయము హృదయములో లేదు.

భీమ : (దైన్యముతో) దుస్స్వప్న మేలవచ్చినట్లు?

ధర్మ : ఈవేళ మందరధరుఁడేలకో సభకురాక యాలసించినాఁడు. నకుల సహదేవులలో నెవరినైనఁ బంపి వెంటనేరప్పింపుము. ఆ జగన్నాథుని దర్శించినఁగాని యీ మనస్తాపము వెనుకాడదు.

భీమ : చిత్త మట్లే కావించెదను. (భీముఁడు నిష్క్రమించును)

(శ్రీకృష్ణస్వామితో మరల భీముఁడు ప్రవేశించును)

శ్రీకృ : ధర్మనందనా! నమస్కారము.

ధర్మ : దేవా యీ పీఠము నలంకరింపుము. (శ్రీకృష్ణస్వామి కూర్చుండును)

శ్రీకృ : పూరువంశోత్తమా! దుస్స్వప్నము వచ్చినదన్నావఁట యేమిటది.

ధర్మ : స్వామీ! యేమని చెప్పుదును. తెలతెలవేగునప్పుడు కలలో నూనెఁ బూసికొని, రక్తమాల్యాంబరధరుఁడై యర్జునుఁడు గాడిదపై నెక్కి దక్షిణదిశగాఁ బోవుచు నొక పేడ గుంటలోఁ బడి మునిఁగిపోయినట్లు చూచితిని. మఱియు.

తే. పార్థుఁడేమఱి యొకచోటఁ బవ్వళింప
దొంగలిరువురు దరిఁజేరి దుష్టబుద్ధి
మస్తకముఁ గోసికొనిపోవుమాడ్కి నిట్లు
కంటి దుస్స్వప్న మీరేయిఁ గమలనేత్ర.

భీమ : (విషాదముతో) ఇది చాలఁగీడుకల యేమికానున్నదో.

ధర్మ : లేచినదాదిగా నాకేమియుఁ దోఁచుటలేదు. అగ్నికుండమునఁ బడి పొరలినట్లున్నది దేహము.

చం. నరుఁడటులేగినాఁడు సవనప్రతిముక్తహయంబు వెంట, భూ
వరులు మహానుభావు లెటఁబట్టిరొ గుఱ్ఱము నెట్టి ఘోరసం
గరములు చెల్లుచున్నవొ సుఖంబుగనుండెనొ లేదొ పార్థుఁడో
సరసిజనాభ యింతయును సంశయమయ్యెను నేఁడు నామదిన్.

శ్రీకృ : ఇందువంశోత్తమా! యేలయూరక చింతపడెదవు. లోకమున సవ్యసాచి యెదుర నిలువఁగల మేటివిలుకాఁడెవండు ?

ఉ. ఆమగధేశ్వరుండు హతుఁడయ్యెను, బేరుగలట్టి రాజసు
త్రాములు సర్వులున్ దెగిరి తప్పక భారతయుద్ధమందు, నీ
భూమిపులెందఱైన నిఁకఁబూని కిరీటిఁ గదల్ప నేర్తురే
దోమలు పెక్కుజేరి పడఁద్రోయఁగఁజాలునె సామజేంద్రమున్.

ధర్మ : ప్రభూ! అట్లనకుము క్షత్రియకులంబున శౌర్యరేఖ మొలకెత్తు చునే యుండును గాని సమసిపోదు.

తే. ఉర్విపైఁ గ్రీడి కుశలియై యున్నఁగాక
యాతఁడొక భంగినైనఁ జో నకట నేను
బ్రతుకనేర్తునె సగముఁ లోఁబడినయట్టి
జన్నమేమానొ తుదకు నోచక్రహస్త!

శ్రీకృ : రాజా! నీకేల యట్టివిపత్తుగలుగు. దైవమానుషంబులుగల నీజన్నం బెప్పటికి భిన్నంబుగాదు. జగంబున నీకుఁ గీడుఁగావించి బ్రతుకునాఁడెవఁడు ?

చ. అలుగవుగాక నీకుమదినాగ్రహమెత్తిన నిల్వనేర్చునే
బలరిపుఁడైననో కుముదబంధుకులాభరణంబ! ధర్మని
శ్చలుఁడవు నీదుయుష్మమది చక్కసగంబున నాగిపోయినన్
జలనిధులింకిపోవె కులశైలములూఁగవె ధాత్రిక్రుంగదే.

ధర్మ : ధర్మనిశ్చలతయూ నాబాంధవుడా, ధర్మస్వరూపుండవును, దేవాదిదేవుండవునైన నీయండ యొకటితప్ప నింక నాకడ నేమున్నది.

శ్రీకృ : పోనిమ్మదియైన నొకటున్నదని ధైర్యమేగదా. ఈ యశోదా నందనుండు నీ మందిరమున నొక కింకరుండై యుండగా నీకు భయపడవలసిన పనిలేదు.

శా. ఏలాగయ్యెనొ మానవేశ్వరులచే నింద్రాత్మజుండంచు ని
న్నేలా చింతిలనీకుఁ గీడొకటిరానేరాదు, పో దైత్య, ది
క్పాలాదిత్య మరుద్గణంబులలుకన్ పైనెత్తినంగాని, నీ
వ్రేలున్ వంపగలేరు చుమ్ము నిజమిుర్వీనాథ నేనుండగాన్.

ధర్మ : ప్రభూ! ఇట్టి నీయనుగ్రహమేగదా మాకేకుగడ లోకమున.

శ్రీకృ : గజపురాధీశ్వరా! యింతకు నిప్పుడీసేవకు నేపనికి నియోగింప నెంచితివో చెప్పుము సంశయింపనేల.

ధర్మ : దేవా యీ దుష్టస్వప్నమువలన నా మనం బర్జునునియెడ నపా యంబును శంకించుచున్నది.

చం. శమితవిరోధియైన యల శక్రతనూభవుఁడెప్డు పైనినీ
విమలసహాయమున్నదను వీఁకనలక్ష్యముసేసి యెట్టిదు
ర్గమమగు కార్యమైన సుకరంబని పూనుచునుండుఁ గావునన్
శ్రమమనిచూడఁబోకు యదుచంద్రమ! నీవటు పోయిరావలెన్.

నరుండిపుడు మణిపురప్రాంతమున నున్నట్లు తెలియవచ్చినది, శీఘ్రగమనంబున భీమసేన సహాయుండవై యాతని క్షేమ మారయ నటకు నీవేగినఁగాని నా మనస్సు కుదుటఁబడదు.

శ్రీకృ : రాజేంద్రా! యట్లే పోయివచ్చెద. నీవుమాత్ర మిచట ధైర్య ముతో నుండుము. అతిశీఘ్రగమనమునకు రథములు పని చేయవు, గరుడారూఢుండనై యరిగెద. బావా భీమసేనా! పద వెళ్లుదము. ధర్మనందనా! సెలవు.

(శ్రీకృష్ణ భీమసేనులు నిష్క్రమింతురు)

(ధర్మరాజును నిష్క్రమించును.) (తెరపడును)

## 5 - వ రంగము

శాండిల్యుఁడు - ఉలూచీ చిత్రాంగదలు ప్రవేశింతురు.
అర్జునుఁడు తల కనఁబడకుండఁ గప్పఁబడి పడియుండును.

చిత్రాం : అక్కా చాలఁ బ్రొద్దెక్కినది. సూర్యోదయమున కేవచ్చెద నన్న కుమారుఁ డింకను రాలేదే.

శాండి : అక్కడ ఏం జరుగుతున్నదోనమ్మా. రావద్దూ పాతాళానికి బోయిరావటం మాటలేనా.

ఉలూ : (నిరూపించిచూచి) అదె వచ్చుచున్నాఁడు పుండరీక ద్వితీయుఁడై న కుమారుఁడు, మణిఁ దెచ్చుచున్నాఁడో లేదో.

చిత్రాం : ఏమోనక్క! నా దౌర్భాగ్యము తేనిచ్చునని నమ్ముటకు మాత్రము వీలు లేదు.

శాండి : బభ్రువాహనుఁడు మణిని వదలివచ్చేదికల్ల. తన్ని అయినా తెస్తాడుగాని ఊరకే రాడు.

(బభ్రువాహన పుండరీకులు ప్రవేశింతురు)

చిత్రాం : తండ్రీ బభ్రువాహనా! సంజీవనమణినిఁ దెచ్చితివా?

బభ్రు : తల్లీ! యిదె గొనివచ్చితిని. (చూపుట నభినయించును)

ఉలూ : నాగులు సరిగానిచ్చిరా లేక యద్దుపెట్టి బాధించిరా.

పుండ : సరిగానిచ్చువారైన నాకే యిచ్చియుందురుగదా, యెంత పనిఁ జేసిన వచ్చినదీమణి!

శాండి : పుండరీకా! యేం జరిగిందేమిటి అక్కడ.

పుండ : వెళ్ళి మేము ముందర మణినిమ్మని యడిగినాము. అంత నా నాగరాజులందఱుకలిసి మును పే చెప్పితిమిగదా యిచ్చుటకు వీలు లేదని, యని మాట్లాడినారు. అంతేనాయన్నాఁడు బభ్రువాహనుఁడు. అంతే ముమ్మాటికినంతే యన్నారు వారు. సరే కానిం డని క్రోధావేశములో బభ్రువాహనుఁడు ధనుస్సును దీసికొన్నాఁడు, గాఢాకర్షణముఁ గావించి మయూరాస్త్రమును బ్రయోగించినాఁడు.

శాండి : దంచూనాసామిరంగా నెమిళ్ళు పుట్టినయ్యా బాణము వెంటనే

పుండ : భోగవతీపట్టణమంతయు నిమేషమాత్రములో నెమిళ్ళతోనిండి పోయినది. ఆ నెమిళ్ళన్నియుఁ బాములను ముక్కులతోఁబొడిచి కాళ్ళతోఁ దన్నుట కారంభించినవి.

శాండి : గాడిదకొడుకుల రోగము వదలిపోయింది తరువాత.

పుండ : తరువాత క్షౌద్రాస్త్రమును వదలినాఁడు. ఆయస్త్రమహత్త్వమేమో యేమి తేనెకురిసినది! కొంచెము సేపటిలో వీధులనిండ నిండ్లనిండఁ దేనెయే.

శాండి : బలే వహ్వా! ఆ తేనేమైనా ఒక అరసోలెడు నాకావానీవు? నేనైతే కడుపునిండేవఱకు జుర్రేవాడిని.

పుండ : ఆ తేనె జిడ్డులోఁ బాములు చుట్టవేసికొనిపోయినవి, తరువాత పిపీలికాస్త్రమును సంధించినాఁడు.

శాండి : నా కొండెగాళ్ళను చీమలు బొత్తెలుబొత్తెలుపెట్టి పీకిఉండాలి.

పుండ : పీఁకుటలో సామాన్యముగానా, అంగుళము ప్రమాణముగల చీమలు కోట్లు జేనెఁడెత్తున మూఁగినవి. తేనె పూసికొనియున్న పాములశరీరముల నన్నిటిఁ జెండివైచినవి. పాపము పాములపని యెట్లున్నది. ఆలగోడు బాలగోడు.

శాండి : తొత్తుకొడుకులు మణిని ముందేయిస్తే యీ బాధ లేదుగా!

పుండ : అప్పుడు పెద్దపెద్ద సర్పరాజులందఱు వంకదండాలుపెట్టుచు వచ్చి బభ్రువాహనునకు మణినిచ్చి "బాబూ నీపని కాగానే మరలఁ బంపింపుము, మమ్మనుగ్రహింపుమని బ్రతిమాలిరి. అప్పుడు మరల వారికా బాధనంతయు నొక యస్త్రమున మాయించినాఁడు. మణి యిట్లు వచ్చినది.

ఉలూ : ఇంతపనిచేయించుకొని నాగరాజులు మణినిచ్చిరి. వారి బుద్ధికౌశలమేమనవచ్చును. కుమారా! బభ్రువాహనా! నీతండ్రి

గారి శిరమును, శరీరమున కంటించి యాదివ్యమణిని వక్షస్థల
మున మోపుదు. వెంటనే లేచి కూర్చుండును.

బభ్రు : (మణిఁబెట్టఁబోయి) అమ్మా తండ్రిగారి శిరస్సేది !

చిత్రాం: ఉలూచి - (సంభ్రమముతో) ఏమైనది ! అక్కడ లేదా.

బభ్రు : ఏదీ ? (అందఱు వెదకుదురు)

ఉలూ: కొంపమునిఁగినది శిరస్సు లేకపోయిన మణి యుపయోగింపదు.

బభ్రు : మీరిచట లేరా. మీరిటనుండగనే శిరంబేమైపోయినది ?

చిత్రాం: అయ్యో నేనేమి సేయుదును. మేమిచటనే యుంటిమి,
ఇచటి కెవరును రానుగూడ రాలేదు.

శాండి : అయ్యోరామ. అర్జునుడు బ్రతుకుతాడంటే నిజమే కాబోలు
నని బ్రతికిఉన్నా, మళ్ళీ చచ్చిపోయాను నేను (ఏడ్చును)

బభ్రు : ఇది యేదియో మాయగానున్నదే.

పుండ : మనకచట మణినిచ్చునపుడొక ప్రక్కఁజేరి యిరువురు నాగ
కుమారులు మనవంకఁ జూచుచు గుసగుసలాడుచున్నారు.
వారు కామరూపులుగనుక నదృశ్య దేహములతోవచ్చి
యీపనిఁజేసిరేమోయని నా సందేహము.

బభ్రు : మణినిఁ గనుకఁ బరాక్రమించి నాగులవద్దనుండి తెచ్చితిమి.
తండ్రిగారి శిరస్సెచ్చటనున్నదని తేఁగలము. బ్రతికింపవచ్చు
నని గంపెఁడాసతో నేఁజేసినపని యంతయు దూసరవోయినది,
హా కృష్ణా ! జగన్నాథా ! హతోస్మి (మూర్ఛపడును)

(అందఱు హాహాకారములు సేయుదురు తెరపడును)

## 6 - వ రంగము

(శ్రీకృష్ణ భీమసేనులాకాశయానమును నటించుచుఁ బ్రవేశింతురు)

శ్రీకృ : భీమసేనా ! యదె మనముందటఁ గనిపించునదే మణిపురంబు.

భీమ : దేవా! యదువర్ధనా! నిమిషమాత్రమున నెంతదూరము
వచ్చితిమి. ఈగరుడుని ప్రభావమేమని చెప్పవచ్చును !

శ్రీకృ : మన ముందుఁ గ్రిందికిఁ జూడుము, భూభాగమంతయుఁ జాల భీభత్సముగా నున్నది.

భీమ : (నిదానించి చూచి) స్వామీ! యిచ్చటనేవియో రెండు సైన్యములకు ఘోరయుద్ధము జరిగినది. మన సంబంధముగాదు గదా.

శ్రీకృ : భద్రగజములు తండోపతండములుగాఁ దెగినవి. జవనాశ్వంబులు వేనకు వేలు మడిసినవి. రాజుల ఛత్రచామరములచే భూమి కప్పఁబడియున్నది. రథశకలములు తెఱచై యున్నవి.

భీమ : (సంభ్రమవిషాదములతో) హా ప్రభూ! యిదె యౌవనాశ్వుని కళేబరము. అదె యనుసాల్వుఁడు నేలఁగూలియున్నాఁడు. ఇది యాగాశ్వము వెంటవచ్చిన మన సైన్యమే.

శ్రీకృ : పెక్కురు రాజులు మడిసిరే!

భీమ : హా జగన్నాథా! యివె వృషకేతనుని శిరశ్శరీరములు, అక్కటా ఘోరయుద్ధము జరిగినది. కర్ణుని మరణమునకే యల్లాడుచున్న యన్నగారీ బాలుని మృతి విన్న జీవించునా? యింతకు నర్జునుఁడేమైనయట్లు!

శ్రీకృ : ఇంచుక దూరమున నెవరో కనిపించుచున్నారు చూడుము.

భీమ : (నిరూపించి చూచి) వారె సవ్యసాచి భార్యలు ఉలూచీ చిత్రాంగదలు. కుమారుఁడు బభ్రువాహనుఁడతఁడు. అదె మన శాండిల్యుఁడు. ఇంక నెవరోయున్నారు. వీరందఱు నొక దివ్య దేహము చుట్టును జేరి విలపించుచున్నారు. (విషాదముతో) ప్రభూ! ఆ దేహ మర్జునునిది కాదు గదా.

శ్రీకృ : (ఆశ్చర్యముతో) ఏమీ! చాలవిపర్యాసముగా నున్నదే.

భీమ : దేవా! నిశ్చయముగా నర్జును నపాయమేయిది. కావున్న నులూచీ చిత్రాంగద లీపాలికలని కేలవత్తురు. హా పాండు కుమారులందఱు మడిసినట్లే.

శ్రీకృ : భీమసేనా! యించుక ధైర్యమవలంబింపుము. నేనుండగా మీకువచ్చిన భయంబు లేదుగదా.

భీమ : స్వామీ! భూమికి దిగుదము. ఆకళేబరమేమియో తెలిసి కొనువఱకు నాహృదయము తల్లడిల్లిపోవుచున్నది. శరీర మవశమై భూమి కొఱగుచున్నది.

శ్రీకృ : భయపడకుము నేలకుదిగి విషయము పరిశీలింతము.

(నిష్క్రమింతురు తెరపడును)

## 7 - వ రంగము

(ఉలూచీ చిత్రాంగదలు, శాండిల్య బభ్రువాహనులు ప్రవేశింతురు. అర్జునుఁడు తలకనఁబడకయుండఁ గప్పఁబడి యుండును.)

చిత్రాం: హా నాథా! నాయాస యడియాసమైనది. మణివలన బ్రతుకుదువుగదాయని సంతసించితిని. పాపచారిత్రనైన నాకట్టి ప్రాప్తియేల కలుగును.

ఉలూ : ప్రాణేశ్వరా! మణివలన నిన్ను బ్రతికింపవచ్చునని కుమారు నకు నీకు యుద్ధము కలుగునట్లు మాట్లాడితిని. ఇట్టి విఘాతము జరుగునని యెఱుంగనైతిని. ఎంత ప్రమాదము సంభవించినది!

శాండి : (చూచిసంతోషముతో) ఆహా! అర్జునుడు బ్రతికినాడు. మనమందఱమూ బ్రతికినట్లే. దేవాది దేవుడైన శ్రీకృష్ణ స్వామియదె వచ్చుచున్నాడు. భీమసేనుఁడుగూడ వెంటవచ్చు చున్నాడు. ఏమి మన భాగ్యపరిపాకము.

(శ్రీకృష్ణ భీమసేనులు ప్రవేశింతురు)

ఉలూ: చిత్రాం, బభ్రు - శాండి - దేవా నమస్కారము. (అందఱు శ్రీకృష్ణస్వామికి నమస్కరింతురు.)

బభ్రు : తండ్రీ నమస్కారము (భీమునకు నమస్కరించును)

శ్రీకృ : కుమారా! బభ్రువాహనా! యేమి యీ వైపరీత్యము. ఇది యర్జునుని కళేబరమేనా?

బభ్రు : చిత్తము.

శ్రీకృ : ఇట్లేల జరిగినది.

బభ్రు : దేవా! యాగాశ్వము మాపురప్రాంతమునకు రాగాఁ దెలియక నా సేనాధిపతి పట్టినాఁడు. నేను దెలిసికొని విచారపడి గుఱ్ఱమును దీసికొనివచ్చి బహుమానపురస్సరముగా నప్పగింపఁ జూచితిని. కాని తండ్రిగారు కోపించి "నా కుమారుఁడవైనఁ బరాక్రమింపక యిట్లు గుఱ్ఱమునప్పగింపరా"వని తిరస్కరించి నన్నుఁ దన్నిరి.

శాండి: గుఱ్ఱాన్ని దీసికోమని అనుగ్రహించమని చాల బ్రతిమాలేడు పాపము.

బభ్రు : అంతట నేను చేయునది లేక యుద్ధమునకు సన్నద్ధుఁడనైతిని.

చిత్రాం: దేవా! కుమారునిపై నలుకవలదని నీ మఱఁది నెంతయో ప్రార్థించితినిగాని వినలేదు.

బభ్రు : ఐదుదినములు యుద్ధము జరిగినది. వృషకేతనుఁడు పెక్కుమంది రాజులు నాచేఁ దెగిరి. ఐదవనాఁటి యుద్ధమున నా బాణపాతమునఁ దండ్రిగారిట్లైరి.

శ్రీకృ : అక్కటా యెంత జరిగినది.

భీమ : హా! త్రిలోకవిజయధురంధరా గాండీవధరా! (మూర్ఛపడును శాండిల్యుఁడు లేవఁదీసి కూర్చుండఁ బెట్టును)

భీమ : (లేచి-హా జగన్నాధా!

చం. దురమున దేవదానవులఁ దోలగఁ జాలు ధనుర్ధరుండు సుం
దరసుకుమారదేహుఁడు పృధాసుత పాలికిఁ బ్రాణభూతుఁడీ
తెఱఁగునదిక్కులేక తెగి కీనదశన్ బడియున్నవాఁడు నీ
మఱఁదినిఁ జూచి నావె మురమర్దన యేనిఁక నెట్టులోర్చెదన్.

శ్రీకృ : అర్జునునిశిరం బేదీ ?

బభ్రు : స్వామీ ! నా సవతితల్లిపంపగా సంజీవనమణిఁ దెచ్చుటకై నేను పాతాళంబున కేగితిని. వీరందఱు నిటుఁగాచుకొనియుండ గనే తండ్రిగారిశిరంబు మాయమైనది. నేను మణినిఁ దెచ్చితిని. గాని శిరంబుఁగానక కర్తవ్యమూఢులమై విలపించుంటిమి. ఇట్టి సమయమున సాక్షాత్కరించిన భాగ్యాధిదేవతలవలె మీరు విచ్చేసితిరి.

శ్రీకృ : (ఆలోచించి) ఓహో నాగకుమారులీ శిరమును దొంగిలించుకొనిపోయిరి. ఈ దేవకికొడుకుండగనే యర్జునునిఁ జంపవలెనని గాఁబోలు వారిభావము. (కోపముతో) నర్జునిశిరం బపహరించిన నాగులిరువురు చత్తురుగాక. అర్జునుని శిరంబిప్పుడ వచ్చుఁగాక.

తే. జన్మమాదిగ నే బ్రహ్మచారినైన
సత్యధర్మంబులకు నేనెస్థానమైన
నేనెలోకంబులకు మూలమైన సవ్య
సాచియిప్పుడె జీవించి లేచుఁగాక.

వృషకేతనుఁడును దక్కటిరాజులును రాజసైన్యంబులును బునర్జీవితులగుదురుగాక. (అర్జునుఁడు లేచును)

శాండి : ఆహా ! దేవాదిదేవా యేమినీమహిమ. ఒక్కసారిగా అందఱూ నిద్రపోయేవాళ్ళు లేచినట్లుగా లేచారే.

అర్జు : పెద్ద నిద్రవోయి లేచినట్లుగా నున్నది. (చూచి) దేవా ! నంద కుమారా ! అన్నగారును మీరును నెప్పుడిచ్చటికి వచ్చితిరి. ఇదె నా నమస్కారము (నమస్కరించును.)

భీమ : మేమిప్పుడే వచ్చితిమి. కాని నీకెంత యాపత్తుజరిగినది. కుమారునిచే రణాంగణమునఁ దెగిపోయిపడి కమలనాభుని కరుణచేఁ గ్రమ్మఱ బ్రతికితివి. మేమెల్లరము బ్రతికినవారమైతిమి.

ఉలూ. చిత్రాం : ప్రాణేశ్వరా వందనములు. (అర్జునునకు నమస్క రింతురు)

బభ్రు : తే. నీదుపంపున యుద్ధంబు నెరపినాఁడ
గాని దుర్భావమునఁగాదు కమలనేత్రు
పాదనళినంబులానగాఁ బలుకుచుంటిఁ
గొడుకు నన్ఁ జూడుఁకృపతోడఁ గురువరేణ్య !

(అర్జునుని పాదములపైఁబడును)

శ్రీకృ : అర్జునా ! పొరపాటుఁజేసితివి, మహానుభావుఁడైన కుమారు నిపై నిష్కారణముగా నలుకవహించితివి. తగదు, నీకీ బభ్రు వాహనుఁడు గారవింపఁదగు కొడుకు.

అర్జు : (సంతోషముతో)

ఉ. సన్నుతకీర్తివైభవుని సాహసధైర్యపరాక్రమాది సం
పన్నుని సత్యశీలగుణభద్రుఁ బవిత్రు దురాగ్రహంబునన్
దన్నితి నిన్నునట్లు వసుధావరులందఱు చూడ, దానికిన్
జిన్నతనంబు నొందకు విశిష్టచరిత్రుఁడవీవు పుత్రకా !

(కౌఁగిలించుకొనును)

శ్రీకృ : సాత్యకి ప్రద్యుమ్ను లేమైరి ?

శాండి : దేవా యర్జునుని శిరంబుఁగానక యదియేమైనది తెలిసికొన వలెనని యిటకుఁ గొలది దూరములోనున్న యొక మహర్షి యాశ్రమంబునకుఁబోయిరి.

భీమ : ఇంకఁ దెలిసికొనవలసినదేమున్నది. శ్రీకృష్ణస్వామి వచ్చిరనియు నర్జునాదులందఱు బ్రతికిరనియుఁ జెప్పి వారినిఁ దీసికొనిరమ్ము.

శాండి : సరే యట్లైనఁబోయివచ్చెద సెలవు.

(శాండిల్యుఁడు నిష్క్రమించును)

బభ్రు : (విషాదముతో) నాల్గుయుగంబులయందు నావలెఁ బితృవధ మొనర్చిన మహాపాతకుఁడు వేఱొకఁడు లేఁడు. నాకీ ఘోర

పాపమెట్లు శమించును. వల్కలములుగట్టి కందమూలములఁ గుడుచుచుఁ దపస్సినై జీవితాంతమువఱకుఁ దపమాచరించెద. నందులకు మీయందఱియనుమతియైనచో వనములకుఁబోయెద.

భీమ : వత్సా, బభ్రువాహనా! నీ తెలివియింతలోనే యున్నదా? అరణ్యముల కరిగిన నచట నీపాపము నుపశమింపఁ జేయువారెవరు? కర్మఫలప్రదుఁడును జగత్కర్తయు, ధర్మస్వరూపుఁడును, జగన్నివాసుండునైన వెన్నుండిట సన్నిహితుండై యుండఁగా వనములకరిగెద నందువేల? యుద్ధమున మేము తాతలఁ జంపితిమి. తండ్రులనఱికితిమి. గురువులఁ గూల్చితిమి. సకలబంధు దాహముఁ జేసితిమి. కాని యే మహామహుని కరుణవలన నీసమంతయైనఁ బాపమును మమ్మంటలేదో యట్టి యీ దామోదరు నడుగులపైఁబడినఁ దొలంగని పాపము నొకటియున్నదా.

బభ్రు : లోకప్రభూ! యీ పాపాత్మునను గ్రహింపుము,

(శ్రీకృష్ణస్వామి పాదములపైఁబడును.)

శ్రీకృ : వత్సా నీకేపాపంబును లేదు. గంగాశాపమువలన నర్జునునకీ యపాయము గలిగినది. నా సంకల్పబలమునఁ దొలఁగినది. నీకుఁగావలసిన వరంబులిచ్చెద నడుగుము.

బభ్రు : ప్రభూ! యిట్టి నీయనుగ్రహమునకన్న నింక నాకేమి కావలయును. వరమీఁదలంచినచో నిదియగుఁగాక!

## భరతవాక్యము

తే. నెలకు ముమ్మారు వానలు గలుగుఁగాక
కలహదుర్భిక్ష బాధలు తొలఁగుఁగాక
యాధులును వ్యాధులును లేక యఖిలజనము
సౌఖ్యపడుఁగాక సతతంబు జగతిలోన.

శ్రీకృష్ణార్పణమస్తు

సమాప్తము.

# మా యాశ్రమమున లభించు గ్రంథములు

శ్రీభాష్యకార సమాజ స్థాపకులు, మా పితృపాదులునైన

## మహర్షి శ్రీ వేంకటదాస స్వామివారి

భక్తిరస మహాగ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | జ్ఞాన సూర్యోదయము (సులభ వచనము) భక్తి వేదాంత శాస్త్రములకు సమగ్రమైన భాష్యమువంటిది | 15-00 |
| 2. | గోపికావిలాసము (పద్య ప్రబంధము) | 2-00 |
| 3. | శ్రీసీతారామ ప్రభావము ,, | 1-50 |
| 4. | లక్ష్మీస్తవము ,, | 1-00 |
| 5. | వరవరముని హృదయము (విశిష్టాద్వైత సిద్ధాంత ప్రథమసోపాన వచన గ్రంథము) | 1-00 |
| 6. | భాగవత సురభూజము (భక్తిరసకీర్తనలు) | 1-00 |
| 7. | పండరి రగడ | 0-20 |

మా యన్నగారు

## పండిత శ్రీ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లుగారివి

| | | |
|---|---|---|
| 8. | శ్రీ శేషనగేశస్తవము (సంస్కృత పద్మావతీ స్తుతి సహిత పద్య ప్రబంధము) | 1-50 |

నావి

| | | |
|---|---|---|
| 9. | కావ్యకళ (పద్యకావ్యము) | 2-00 |
| 10. | భారత గానము | 0-50 |
| 11. | తపోమహిమ | 6-00 |
| 12. | చిత్రాంగదా నాటకము | 2-00 |

ప్రాప్తిస్థానము :

కవిభట్టారక మొవ్వ దాశరథి సూరి (విష్ణుదాసు)

శ్రీ వేణుగోపాల సేవాశ్రమము

పూశివాడ, వయా చందోలు

గుంటూరు జిల్లా

